# కమలావతి

(4, 5, 6 ఫారములకు)

సోమవఝుల సత్యనారాయణ శాస్త్రి
సీనియర్ తెలుఁగు పండితుఁడు
మునిసిపల్ హైస్కూలు
విజయనగరం

పబ్లిషర్సు
రావు బ్రదర్సు (రిజిష్టర్డు)
తెనాలి

 [వెల రు. 0—12—0

# విషయసూచిక

# కమలావతి

## మొదటి ప్రకరణము

---

### పురవర్ణనము

శ్రీమదఖండభూమండలమండనాయమానంబై వేదశాస్త్ర పారగులును యజనాది షట్కర్మ నిరతులును తపోధనులు నగు భూసురులతోడను నిరస్తసమస్తభూపతులు శూరాగ్రేసరులు నగు నృపవరేణ్యులతోడను ధనరాసులచేఁ గుబేరు నైన పరిహసించు వణిగ్వరులతోడను కృష్యాది వ్యాపారముచే జీవయాత్ర చేయు కృషీవలులతోడను శోభాయమానంబులై, వివిధమణిఖచితంబులై గగనతలంబు నొరయు సౌధరాజులతోడను, నానావిధకుసుమోపశోభితంబులగు నుపవనములతోడను విరాజమానంబై చూపరుల కమరావతిలోని యొక భాగమో యను సందియము కలిగించు మణిపురం బను బురవరం బొండు కలదు.

రూపజితమన్మథుఁడును ధీవిజిత సురాచార్యుఁడును సుగుణాలవాలుఁడును శత్రుభీకరుఁడు నగు ధర్మవర్ధనుఁ డను ధరా

వల్లభుండు మణిపురంబు నేలుచుండె. ఆ ధరణీధవుఁడు మగధ దేశాధీశు పుత్రికయు ముల్లోకంబుల జయింపఁగోరు మదనుని పంచమేతర సాయకంబును సీమంతినీ శిరోభూషణంబునై యొప్పు కళావతిని బరిణయం బయ్యె. ఈ రాజేంద్రుని పాలనమునఁ బ్రజలెల్లరు రాగద్వేషవిరహితులు ధనధాన్యాదివస్తు సమృద్ధికలవారు నిరామయులునై మెలంగుచుండెడివారు.

ఈ రాజశ్రేష్ఠునకుఁ జంద్రగుప్తునకు చాణక్యుఁడువోలె రాజనీతివిశారదుఁడును నా బాల్యస్నేహితుఁడు నగు సుబుద్ధి యను మంత్రిసత్తముఁడు కలఁడు. వీ రిరువురు నొకే గురువు చెంత విద్యాభ్యాస మొనర్చినవారు. కార్యాకార్య సమాలోచనాదక్షుఁ డగు మంత్రిపుంగవుని సాహాయ్యమున రాజ్యమం దెట్టి కొఱంతయు లేకుండునట్టుల ప్రజాపాలన మాచరింపుచుఁ గాలము పుచ్చుచుండెడి వాఁడు. ఈ భూపాలపుంగవుఁడు సమస్తసంపద్విరాజమానుఁ డయ్యుఁ బుత్రసంపద్విహీనతచే మిగులఁ బొగులుచుండెడివాఁడు.

ఒకానొక దివసంబున నీ మానవేంద్రుఁ డెప్పటియట్ల తర్క వ్యాకరణ మీమాంసాది షట్శాస్త్రపారంగతు లగు విద్వద్వరులతోడను మాధురీమహిమను పాషాణంబుల నైన స్రవింపఁజేయు గాయకశిఖామణులతోడను నృత్తగీతాదినిపుణలై రంభ, మేనక, తిలోత్తమ, మొదలగు నప్సరాంగనల ధిక్కరించు వారనారీబృందముతోడను స్తుతిపాఠకులగు వందిమాగధులతోడను నిండి సుధర్మనుసైతము నపహసించు సభాభవనమును చేరెను.

తోడన యందలి జనులెల్లరు తమ తమ యాసనములువీడి వినయవినమితగాత్రులై రాజేంద్రునకుఁ బ్రణమిల్లి రాజాను మతంబునఁ దమతమ యాసనముల నలంకరించిరి. గాయకులు గానము చేసిరి. వారాంగనలు నాట్య మొనర్చిరి.

పిదప రాజేంద్రుఁడు శాస్త్రవేత్తలును వేదపారగులు నగు విబుధవరుల నెడఁ దన క్రేఁగంటిప్రసార మొనర్ప వారలు ప్రభునాశయమునుఁ దెలిసికొన నెంచినవారగుటచే నందొక్క రుఁడు తన యాసనమునుండి లేచి రాజేంద్రున కభిముఖుఁడై "భూపాలాగ్రణీ! దేవరవా రెద్దియో ప్రశ్నింపఁ దలచినటుల ముఖవికాసము చూపట్టుచున్నది. ఆశయము వెలిబుచ్చినచోఁ గుసుమమాలికనుబోలె దేవర యాజ్ఞను శిరమునఁ దాల్చి నెరవేర్చువారము. ఆలసింపక యానతీయ వేడుచున్నార"మని వచింప ధర్మవర్ధనుఁ డా పలుకు లాలించియుఁ దనయభీష్టము దా నెఱిగింప మోమోడి సన్నిధానవర్తియు భావజ్ఞుఁడు నగు మంత్రిసత్తమునిపై దృష్టిని బ్రసరింపఁ జేసె. సచివాగ్రణి మానవేంద్రు నాంతరంగికవృత్తము నెఱింగినవాఁ డగుటచే విద్వద్వరునాసనాసీనుగా నాజ్ఞాపించి "భూదేవులారా! మన మౌలిక, సమస్తభూమిపాలమౌళిమణిరంజితపాదుఁడు, నిరస్త సమస్తశత్రుభూపుఁడును దిగంతవిశ్రాంత కీర్తిమంతుఁడునై యున్నవాఁడు. ఇట్టి మానవేంద్రున కెట్టి లోపము లేకున్నను ననపత్యత మనశ్శల్యమై తీవ్ర వేదనాకర మగుచున్నది. అయ్యది తదాశ్రయులమగు మన కెల్లరకు దుర్భరమై తోప భూపతి కెటులుండునో వారలు వేఱ వచింపనేల? మనము తెలిసికొన నగు. ఇంతకుఁదక్క వచనీయ మించుకయు లేదు

గాన దేవరవారు సంతానవంతులగుట కర్తవ్యమగు వ్రత, హోమ, సవనాదులున్న నరయనగు'' నని వచించె.

అంత నొకపండితుఁడు నిలిచి రాజాభిముఖుఁడై, మంత్రిసత్తముఁడు వచించినది యథార్థము. ''శూన్యమపుత్ర స్యగృహమ్మ''ని శూద్రకకవి చెప్పినటుల ననపత్యత యెట్టివారినైన దుఃఖాబ్ధిముంచుననఁగ శుభంతాక్రాంత యశో విరాజమానుఁడును సప్తద్వీపాభి శోభిత వసుంధరాధవుండు నగు మనయేలిక విచారించుటలో సందేహమేమి? మానవేంద్రుఁడు పుత్రవంతుఁడగుట మనకు నానందదాయకము. లోకమున మానవుఁడు తాను పుత్రవంతుఁడై పున్నామ నరక విముక్తుఁడగుననియు నుత్తమ లోకములఁ బడయుటకుఁ బుత్రుఁడే యేడుగడ యనియు శాస్త్రములుద్ఘోషించుచున్నవి. దీపము లేకున్న నంధకారబంధురమగు గృహమెటులజొర నశక్యమో యా విధముననే యపుత్రకు లుత్తమ లోకములఁ బడయ ననర్హులనియు వక్కాణింపుచున్నవి. కావున దేవరవారు పుత్రవంతులగుటకై గోభూ, హిరణ్యాది మహాదానముల భూదేవులఁ దనియఁబఱచి వారి యాశీర్వాదములఁ బడయుట, విదురాశ్వత్థము(బెంగుళూరున కనతి దూరముననున్నది)నాలింగన మొనర్చుట, గంగ, గోదావరి, కావేరి, తుంగభద్ర మొదలగు తీర్థములఁ గ్రుంకులిడుటయు, ముఖ్యపక్షము. తామంతులకై తగు యత్నము కావింపుఁడు. మేమును జప హోమాదికమున దేవతలఁ దనియఁజేతుము. ''దైవం నిహత్య కురుపౌరుష మాత్మ శక్త్యా'' అను నార్యోక్తి చొప్పున మానవుఁడు శక్తివంచన చేయక కార్య యత్న

మొనర్పనగు. అయ్యది దైవానుకూల్యమున ఫలవంతమగును. భగవంతుఁడు మన యత్నములకుఁ తోడ్పడెనేని దేవరవారు పుత్రవంతులగుదురు. సంశయింపకుఁడు. అని వచింప సభ్యులెల్ల రావాక్యముల నామోదించిరి. ధర్మవర్ధన మహీధవుఁడు తత్కార్యాచరణ నిశ్చిత మనస్కుఁడయ్యె. రాజానుమతంబున నందలి వారెల్లఁ దమ తమ మనికి పట్టుల కేగిరి.

రెండవ ప్రకరణము

## ధర్మవర్ధనుని పుత్రప్రాప్తి

మంత్రిసమేతుఁడై రాజేంద్రుఁడు దేవీవాసభవనమున కేగె. కళావతి, వసంతసమేతుఁ డగు మనోభవునికై వడి చూపట్టు మంత్రిసమేతుఁడై యరుదెంచుచున్న ధర్మవర్ధన మహీధవుని దవ్వుదవ్వుల నీక్షించి తన యనుంగు చెలియ యగు కనకవల్లిని బిలిచి యాసనార్ఘ్యపాద్యా ద్యుపచారములఁ గావింప నియమించి తా లోని కరిగె. కనకవల్లి మొదలగు పరిచారికలు తత్తదుపచారములు గావింప రాజును మంత్రియు వేర్వేఱు వేత్రాసనముల నలంకరించిరి. పిదప ధర్మవర్ధనుఁడు, పట్టమహిషియగు కళావతిని దమచెంతకు రా నాజ్ఞాపింప నా యన్నులమిన్న ప్రాణనాథునాజ్ఞ నుల్లంఘింప నోల్లక కుసుమమాలికఁబోలె తదాజ్ఞ శిరసావహించి తోడన రాజుచెంత కరుదెంచి లజ్జావనతముఖియై నిలిచియుండ ధర్మ వర్ధనుఁడా పెనుగూడ వేఱొండు నాసనమున నధివసింప నాజ్ఞా పించె. దేవి, ఆసనాసీనయగునంత ధర్మవర్ధనుఁడు మున్ముందు కుశలప్రశ్న మొనర్చి ప్రసంగానుప్రసక్తిగ నాటి సభయందలి యుదంతమును దెలియఁ బలికె. తద్వాక్యశ్రవణమాత్రమున నే యాపె శోకపరీతస్వాంతయై బాష్పపూరితనేత్రాబ్జయై చూపట్ట మంత్రిసత్తముఁడు కళావతి నుద్దేశించి, "తల్లీ! లోకమున దేహికెట్టివానికేని కష్టసుఖములు తత్తత్కర్మానుసరణములై వాటిల్లుచుండు. సత్కర్మాచరణముచే సత్ఫలముల మానవులుగాంతురని శాస్త్రములు చెప్పుచున్నవి ఉత్తమకర్మా

చరణమునఁ దామును ననపత్యతాక్లేశభార విముక్తులగుదురు. విచారింపకుడ" న నాసతీ లలామంబు మంత్రిగావించిన వాక్యామృత సేచనమున నించుక ధైర్యమూని సత్కార్యాచరణ నిశ్చిత హృదయ యయ్యె. చక్రవర్తియు మంత్రియగు సుబుద్ధిని రాజకీయము నిర్వర్తింప నాజ్ఞాపించి తానును సత్కర్మ లాచరింపఁ గృతనిశ్చయుఁడయ్యె. రాజానుమతంబున మంత్రి సుబుద్ధి తన భవనమున కేగె.

మఱుచటి దినమున రాజు దిన ముఖోచిత కృత్యము నిర్వర్తించి యెప్పటియట్ల సభాస్థలి కేగి సింహాసన మలంకరించి యందలి వారెల్ల విన "తాను దీర్ఘయాత్ర లొనర్ప నేగుచుంటిననియుఁ దావచ్చునంతదనుక ప్రధానియే రాజకీయముల నెరవేర్చుననియు మీరెల్లరు మీమీ కార్యముల నప్రమత్తులరై యొనర్పుఁడు" అని వచించి యానాటి నుండియుఁ దాను వ్రతాచరణ సంసిద్ధుఁడయ్యె. ఆ రాజేంద్రుఁడు సతీసమేతుఁడై గోభూ హిరణ్యాది మహాదానముల భూదేవుల తనియఁజేయుచుండె. తీర్థయాత్రల సద్వ్రతాచరణమునను గాలము పుచ్చుచుండె.

ఇట్లుండ ననతికాలమున వీరి సత్కార్యాచరణమునకు ఫలంబుగాఁ గళావతి యంతర్వత్ని యయ్యె. పౌరుల ముదంబుతో లె లేఁగాను విస్తరించె. గమనంబు మందమాయె. భూషణంబులు భారమయ్యె. ఆహారమరుచియయ్యె. ఈ తెఱుగున దౌహృద చిహ్నములు చూపట్టుడు న్నీవార్త నెచ్చెలుల ముఖంబున ధర్మవర్ధనుని శ్రుతిపథంబు నలంకరించె. రాజును కరంబు ముదంబునొంది యాబాల్య స్నేహితుఁడును సచివాతంసుఁడు

నగు సుబుద్ధికీ వార్త ప్రచ్ఛన్నముగ నెఱిగించె. మాసచతుష్టయమగుడు శుభముహూర్తమున మానవేంద్రుఁడు బంధుమిత్ర పరీతుఁడై సీమంతోత్సవము గావించి కుమారోత్పత్తి వార్తాశ్రవణ కుతూహలుఁడై దినములు పుచ్చుచుండె.

దశమ మాసము ప్రాప్తించిన తోడనే దుష్టగ్రహ వర్జితంబును లుచ్ఛగ్రహ సంయుక్తంబును నైన శుభలగ్నమునఁ బ్రాక్సతి షోడశ కళాపరిపూర్ణుండగు శీతభానుని వలెఁ గళావతి రాజలక్షణ విరాజమానుఁడును, రేఖాలంకృత శంఖ చక్రోప శోభితకర కమలుఁడును రూపజితరమాకుమారుండు నగు కుమారుని గనెను. జ్యోతిశాస్త్రవేత్తలు లగ్నశుద్ధి పరిశీలించుటకై నియమితులగుటచే వారు వారి కృత్యముల నిర్వర్తించి కుమారోత్పత్తి కాలము నిర్దుష్టము, ఉత్తమోత్తమునుగా నెఱిగించిరి.

ఈ శుభవార్త వినిన తోడనే రాజగు ధర్మవర్ధనుఁడు చంద్రోదయకాలమునఁ బారావారమువోలె నమితానంద వారాశి నోలలాడి తత్సూచకంబుగ నాకాలము నచటఁగల బ్రాహ్మణప్రవరుల మహాదానములఁ దనియఁజేసి గురునాజ్ఞానువర్తియై జాతకర్మ యొనర్చి మంత్రియుఁ దానును బ్రియాలాపములతో దివసావశిష్టభాగము వెళ్లఁబుచ్చె.

కర్ణాకర్ణిగ నీవార్త పురమందంతట వ్యాపించె. పౌరులెల్లరు తమ యేలిక పుత్రవంతుఁ డయ్యెనని మిగుల నానందించిరి.

రాజానుమతంబున మంత్రి సుబుద్ధి, యీ వార్త తమ దేశమందంతట వెళ్ళడించె. సామంతరాజులు బంధువులు

విడియుటకై సౌధరాజముల శుభ్రపఱుపను, వాజివారణ శాలల నిర్మింపను, నధికారవర్గమున కాజ్ఞసేసె. చిత్రకారులు, శిల్పులు లోనగువారు రాజనగరు లోనగు సౌధరాజముల నలంకరించిరి. రాజమార్గములన్నియు ధ్వజపతాకముల తోడ విరాజిల్లుచుండె. పౌరులెల్లరు తమ భవనముల సుధాధవళితములుగా నొనర్చి ద్వారదేశములఁ జూతపత్రరంభాస్తంభశోభాయమానంబులుగా నొనర్చిరి. పదియవదివసమున సామంతరాజులు యువరాజ సందర్శనార్థ మరుదెంచుచుండిరి. రాజమార్గములన్నియు రథ గజాశ్వ జన సంకులములై విరాజిల్లుచుండె.

పదునొకండవదినము ప్రాప్తించినతోడనే రాజగు ధర్మవర్ధనుఁడు బంధుమిత్ర సామంతరాజు లోకముతోఁ మంత్రియగు సుబుద్ధితోగూడి యభ్యంజన మొనర్చుకొని దినముఖోచిత కృత్యముల నిర్వర్తించి పురోహితాను మతంబున రాజనగరులోని దేవతాసాన్నిధ్యమున కేగి ధర్మచారిణియగు కళావతితోఁ గూడ విధివిధానమున నాయాకర్మ లాచరించి సుపుత్రుని మోహనాంగ నామధేయునిగానొనర్చె. అత్తఱి రాజభవనము వేదవేత్తలగు భూసురుల పుణ్యాహవాచన నినాదములతోడను రాజపుత్ర సమాలోకన సమాగత పౌర జన సల్లాపములతోడను మంగళ తూర్యారావములతోడను నృత్తగీతాది ధ్వనులతోడను ప్రతి నినాదము నిచ్చుచుండె.

## మూడవ ప్రకరణము

## మోహనాంగు విద్యాభ్యాసము

దాదులచేఁ బెంపఁబడుచు మోహనాంగుఁడు శుక్లపక్ష శీతభానుఁడువోలె దినదినాభివృద్ధి నొందుచు మాతాపితల కమితానందసంధాయకుఁడు కులదీపకుఁడునై విరాజిల్లుచుండె. చిన్నవాఁడయ్యు మున్ముందు దానొనర్చెడి యద్భుత శౌర్య పరాక్రమాదులఁ జూపుచుండెడినో యన హస్తిహస్తము తన కరపల్లవములఁ బట్టి శస్త్రాస్త్ర క్రీడలయం దుత్సాహవేశుఁడై తత్తత్కార్యాచరణమున జననీజనకులకు ముదమొదఁ గూర్చుచుండె. శైశవక్రీడలఁ దోడిబాలకులలో నెల్లఁ దాన మిన్నయై విజయము గాంచుచుండె. ఇట్లుఁ గొంతకాల మగుడు విద్యాభ్యసనకాల మాసన్నమగుడు ధర్మవర్ధనమహీపాలుఁడు తనపుత్రు నఖిలవిద్యావిశారదుఁ గా నొనర్ప నెంచి యాదర్శప్రాయమగు విద్యాలయ నిర్మాణము గావించి యా యా శాస్త్రములఁ గూలంకషప్రజ్ఞావంతులగు విద్వద్వరుల నియమించి మిత్రుఁడును మంత్రిపుత్రుడు నగుఁ జంద్రపాలునితోఁగూడ మోహనాంగు గురువులచెంత కనిపి విద్యాబోధనము గావింపించుచుండె.

ఆహా, విద్యాలయములన్న నట్టివిగా నుండనోపు. అవియ యాదర్శములు గానోపు. గురుశిష్యులకంద వాసభవనములు నిర్మితంబు లయ్యె. పుస్తక భాండాగారము లన్ననో రాజవిద్యోచిత, రాజనీతి, దండనీతి బోధక గ్రంథములతో మా

త్రము కాక వేద, వేదాంగ, పలువిధశాస్త్ర గ్రంథరాజముల తోడను గ్రిక్కిరియుచుండె.

సాయంసమయముల విద్యార్థులు విశ్రాంతి గొనుటకై క్రీడారంగ స్థలములు ప్రత్యేక ప్రత్యేకములుగ నిర్మితము లయ్యె. సాయంసమయమున విద్యార్థులు విహారార్థమచటికేగి తమ యిచ్ఛానుగుణముగ నానా పారిశ్రామిక క్రీడలం దాల్గొని యినుండు పశ్చిమాంబుధి గ్రుంకులిడువఱకు ఛాత్రులు తమ తమ నికేతనములకేగి సాయాహ్నిక కృత్యముల దీర్చికొని కృతాహారులై యామమాత్ర కాల మతిక్రమించు వఱకు దివస భాగమున గురువులచే నుపదిష్టము లగు విద్యల నెల్ల మనన మొనర్చి సుఖసుప్తులగుచుందురు. వేగు పోక యగుటయుఁ బ్రత్యూషపవనాంకురములు పైకొను వేళ నిద్ర మేల్కాంచి దినముఖోచిత కృత్యములు దీర్చికొని విద్యాలయముల కేగి సమస్త విద్యల నభ్యసింపుచు గురు వుల ప్రేమపాత్రులగు చుండెడివారు.

మోహనాంగుఁడన్నను శైశవమిత్రుఁడును సహపాఠకుఁడునగు చంద్రపాలునితో సాంగోపాంగముగ ధనుర్వేద మును రాజనీతి దండనీతులగు వివిధ ధర్మశాస్త్రముల నభ్య సించి యసదృశ ప్రజ్ఞావంతుఁడై శేముషీ ధురంధరుఁడను యశము గాంచె.

ఇట్టి ఛాత్రులు లభించినగదా యుపదేష్టల కానందము. సత్పాత్రదానముచే దాత యెంతటి ముదమందునో సచ్ఛాత్రుఁబడసిన యాచార్యుఁడును నినుమడించిన యుత్సాహ

వంతుఁడై తన సామర్థ్యమునెల్ల వినియోగించి బోధింప యత్నించుచుండు. ఇట్లు మోహనాంగ చంద్రపాలు రిద్దరు గురువులచెంత సమస్త విద్యల నభ్యసించి వారి యనుమతిని పిత్రనంతి కమున కేగిరి.

# నాల్గవ ప్రకరణము

## వనవిహారము

కాంచీనగరమును బూర్ణచంద్రుఁ డను ధరణీధవుఁడు పాలించుచుండె. అతఁడు కాంచనమాల యను సతీతిలకమును బరిణయంబై యా లలనామణియందు కమలావతి యను బాలారత్నమును బడసె. ఆ బాలామణి చంద్రకళవోలె దిన దినప్రవర్ధమానయై తోడి సఖీజనముతో బాలక్రీడల నెఱపుచు వర్ధమానయై మాతాపితలకు నేత్రపర్వమై తనరారుచుండె. రూప మసదృశము. రూపసదృశ యగు వినయసంపత్తి. వినయప్రకాశమగు విద్యావిభవము. శస్త్రాస్త్ర విద్యల నసదృశప్రయోగ కౌశల్యము. కమలావతియందు యౌవనము ప్రాదుర్భవించి యంగకములకెల్ల నూత్నశోభ సమకూర్చుచుండె.

ఒకనాటి సాయంసమయమున నా మహీవల్లభుఁడు పత్నీసమేతుఁడై యుద్యానవనమున కేగి యుపవనరామణీయకము తిలకించుచుండ కాంచనమాల, యందొక సహకారపాదపము చెంత నూత్నపుష్పవిరాజమానవల్లీమతల్లినిఁ జూచి ప్రాణనాథునకుఁ జూపించి "కంటిరే" ఈ పుష్పలతిక లేగున్నమావి నల్లిబిల్లిగ నల్లుకొని యెంతటి శోభ వహింపుచున్నదో! లోకమున స్త్రీలుత్తములగు తమ ప్రియులచెంత నున్ననే గదా ప్రకాశింపుట. అతివలకుఁ దమ నాథునికంటె వేఱు లోకము కలదా? ఈ సౌందర్యమును గనుచుండ మన పుత్రికయగు

కమలావతీచరితము స్మృతిపథము నలంకరించుచున్నది. ఆమె ద్వితీయావస్థయగు యౌవనావస్థయందున్నది. ఈ పుష్పలతిక వోలెఁ గమలావతి భర్తచెంతనుండు వేడుకఁ జూడ నుత్సాహము కలదనియుఁ బరిణయోచితకాల మాసన్నమయ్యెను గానఁ దగిన వరునకిచ్చి మనవంశము పునీతము గావించుకొందమ''నియు వచించెను. తన ప్రేయసీవాక్యములు శ్రవణరసాయనములై శ్రుతిపథముఁ బ్రవేశింప నాపూర్ణచంద్రుఁడు కొండొకతడవు ఆలోచనానిమగ్నుఁడై "అబలా! నీవు మంచి యాలోచనాజ్ఞానము కలదానవు. నీవు చెప్పినటుల నుత్తమ రాకుమారున కిచ్చి పాణిగ్రహణోత్సవము గావింతు. ఆలసింపక వరాన్వేషణమునకై సమర్థుల నంపెద." అని యామె నలరించి సతీసమేతముగఁ బురముచేరి నాటిరాత్రియంతయుఁ గుమారికా వివాహప్రసంగములతోనఁ గడపె.

## ఐదవ ప్రకరణము

---

## వరాన్వేషణము

ఆ కాలమునఁ జక్రవర్తులు తమ పుత్రికల నిమిత్తము వరాన్వేషణమునకై కులక్రమాగత పురోహిత సంతతి వారి నంపుట యాచారమగుటచేఁ బూర్ణ చంద్రనృపాలుఁడు వేద శాస్త్ర విశారదుఁడును పురోహిత వంశీయుఁడునగు సుదర్శన భట్టును రావించి యుచితాసనాసీను గావించి సతీసమేతుఁడై యభివందన మాచరించి కృతాశీర్వచనుఁడై. "గురూత్తమా? నా బాలామణి యగు కమలావతికి వివాహోచిత కాల మాసన్నమయ్యె. తగిన వరునన్వేషించి పుత్రిక నొసంగి నా వంశము పవిత్రింపఁ జేసికొనఁ దలంచితి. తా మీకార్యమునఁ దోడ్పడి నను ధన్యుఁ జేయుఁడు." అని వచింప సుదర్శనభట్టా పలుకు లాలించి "నృపాలాగ్రణీ! అవశ్యమీ కార్యమునకై ప్రయత్నింతు. ఆ యా దేశాధీశుల కన్యాఛాయాపటము నభిలషించినచో నుపచరించుగాన కమలావతీ ప్రతికృతిని వ్రాయించి సిద్ధము గావింపుఁడు. తగిన వరుని సమకూర్చు భారము నా యదియ. రేపటి దినము ప్రయాణోచితముగఁ జూపట్టుచున్నది." అని పలికి రాజు ముదలగొని యాత్మీయా వాసమున కేగె.

సుదర్శనభట్టు మాధ్యాహ్నిక కృత్యములు దీర్చి కృతా భ్యవహారుఁడై విశ్రాంతి గొనుచుఁ జరణసేవ గావించుచుఁ జెంతనున్న యనసూయ యను తన యర్ధాంగి నుద్దేశించి

“అతివా, రాజేంద్రుఁడు తన కుమారికకుఁ దగిన వరుని వెదకుటకై నన్ను నియోగించె. రేపు ప్రయాణము. అనతి కాలమున కార్యము ఫలవంతము గావించుకొనివత్తు. నా వచ్చువఱకు గృహనిర్వహణమున జాగరూకత వహింపుము.” అని పలుక నా పాఱుత భర్తృసేవా తత్పరయగుటచే నెడ బాటున కిష్టము లేకున్నను బతివాక్యోల్లంఘన మొనర్ప నిష్టపడక యంగీకార సూచకముగ శిరఃకంప మొనర్చి “నాథా, తాము రాజకుమారికకు వరాన్వేషణమునకై దేశపర్యటన మొనర్చుచున్నారు. కావున నీ తరుణముననే మన పద్మావతికిని దగిన వరుని వెదకునది. తగిన వరుఁడు లభించిన వానికి మన దుహిత నొసంగుదము” అని ప్రార్థించె.

సుదర్శనభట్టు: “అబలా, నీ బుద్ధికౌశల్యము కొనియాడఁ దగినది. రాజకార్యవ్యాపృత చిత్తుఁడనగు నాకా విషయమే స్ఫురింపదయ్యె. ఇట్టి విషయముల మనసునందిడికొనియే ప్రాచీనులు. “కార్యేషుమంత్రీ కరణేషు దాసీ” అను శ్లోకమును వ్రాయఁబూనిరి. “ఏకక్రియాద్వ్యర్థకరీ” అనునట్లు ఒక యత్నమున రెండు కార్యములు ఫలించిన నెవ్వరికి సంతసము కల్గకుండును. ఈ తరుణముననే మన పద్మకును దగిన వరుని వెదకి తెచ్చెద” అని పలికి రాజ కార్యనిర్వహణాసక్తుఁడై యుండెను.

మఱుచటి దినము రాజసభకేగి రాజ సన్మానితుఁడై యగ్రపీఠము నధివసించి కృతప్రణాముఁడై వేదోక్తాసీను వాని నలరింపఁజేసి యిష్టాగోష్ఠియొనర్చి నృపాలదత్తమగు చిత్త

రువు గ్రహించి ప్రభునాజ్ఞగొని గృహమునకేగి కృతస్నానుఁడై దేవపూజ యొనర్చి కృతాహారుఁడై యర్ధాంగియగు ననసూయ భక్తి ప్రపూరిత నేత్రాబ్జయై తన్నుఁ బ్రోత్సహింప సుదర్శన భట్టిలు వెడలె.

ఆ భూసురుఁడు తమ పరిసర రాజధానులలో నెచ్చటెచ్చటఁ గమలావతికిఁ దగినవరుఁ డున్నటుల విన్న నాయాప్రదేశముల కేగుచు 'కన్యావరయతె రూపం మాతావిత్తం పితాశ్రుతం, బాంధవాః కులమిచ్ఛంతి' అను శ్లోకమునఁజెప్పిన విషయము మనసునం దిడికొని పరిశీలింపుచు నందొక్కకని యందొక్కక లోపము చూపట్టఁ దనకునైత మిష్టములేకున్నను దనయనస్మృతిని వెల్లడించుట యనుచితమనియు నొకచో కమలావతికి రుచించిన రుచించుగాక యని దలఁచి యారాకొమరుల ఛాయాపఠముల నందికొని కతిపయ పయనములలో మణిపురమున కేగె. పురద్వారము దాటి రాజమార్గమునఁ బోవుచు "ఆహా! ఏమి ఈపురము సొబగు. పురసౌధములు మిన్ను ముట్టుచున్నవి. వణువాతన యిటులుండె. క్రమముగ నివియెట్టు దర్శనీయములతో నేత్రపర్వమొనర్చునో. ఇది భూతలస్వర్గమువలెఁ గాన్పించుచున్నది. ఈ పురమునేలెడి రాజే రాజనామార్హుఁడు. తక్కినవారు రాజనామవాచ్యులుగాని సార్థకనాములు కారు. ఈ పట్టణాధిపతి చెంతఁ గమలావతీకరగ్రహణార్హుండగు తనూజుఁ డుండిననే సఫలప్రయత్నుఁడ నగుదు" అని తలపోయుచు రాజమార్గము వీడి వేఱొక తెరవుపట్టె. ఆకాలమా ఉషఃకాలము. తానామార్గమున నేగుచుండ నందొక గృహములోనుండి

"జౌషట్" ఇత్యాది శ్రౌతమంత్రములు వినవచ్చె. అద్దాన నదియొక భూసుర గృహోపశోభిత వీధి యనియు గృహాధిపతి యగ్నికార్య మొనర్చుచున్నటుల నూహించి లోనికరిగె. పుత్రముఖంబున గృహమేధి యగు హిరణ్యగర్భుఁ డతిథిరాక యెఱిగియుఁ దా నాప్రదేశము వీడరామి నతిథియగు సుదర్శను నగ్నిహోత్రశాలకు రావార్తనంపి యందొక యాసనము సిద్ధముచేయ సుతున కాజ్ఞాపించె. హిరణ్యగర్భు వాక్యాను గుణముగ సుదర్శన భట్టగ్నిశాలలోని కేగెడి మధ్యకాలముననే కమలమిత్రుఁడు జనకునాజ్ఞ ననుసరించి యగ్నిశాలయం దొక యాసనము సిద్ధపఱచె. అగ్నిశాల కేగిన సుదర్శనభట్టు హిరణ్యగర్భుని కనుసన్నచేతనే చెంతనున్న యాసనాసీనుఁడయ్యె. హిరణ్యగర్భుఁ డగ్నికార్యము సమాప్తమగుడు నతిథియగు సుదర్శనభట్టు నర్ఘ్యాదివిధులఁ బూజించి వానితోఁ గొంతతడవు ముచ్చటించి యాతనిరాకకుఁ గల కారణమూరసి సుదర్శను నానాఁడు తనయింట నాతిథ్యము గైకొన వేడి కాలమాసన్న మగుటచేఁ దా రాజాస్థానమున కేగె. హిరణ్యగర్భుఁడు రాజును దర్శించి తనకృత్యము పూర్తిగావించుకొని దశఘటికా పరిమితకాలమున కిల్లుచేరె. పిదప నతిథి యగు సుదర్శను నాహ్వానించి యిర్వురు మాధ్యాహ్నిక కృత్యములు దీర్చుకొని భుజించిరి. పిదపఁ దాంబూలనిషేవణ మొనర్చుచుండ సుదర్శనుఁడు, "మిత్రమా! హిరణ్యగర్భ, మీయేలిక యగు ధర్మవర్ధనునకు సుగుణవంతుఁడు సుందర విగ్రహుఁడునగు పుత్రుఁడు కలడని వినియుంటి. మా దేశాధీశుఁడగు పూర్ణచంద్రునకుఁ గమలావతి యను పుత్రికా రత్నముకలదు. ఆ బాలామణికిఁ దగినవరుని వెదుకఁబూని

యాయా దేశముల కేగి యీపురమునకు వచ్చితి. నేఁ బూర్ణ చంద్రుని పురోహిత సంతతివాఁడను. నారాక సఫలము కావింపుఁడు. ఇంతియ కాక వచనీయాంశము వేఱొండు కలదు. నీ ప్రియపుత్రుండగు కమలమిత్రునకు నాపుత్రిక యగు పద్మావతి నిచ్చి పాణిగ్రహణోత్సవ మొనర్పఁ గుతూహలము కలదు. నా ప్రార్థన మంగీకరించి నను ధన్యుఁ జేయుఁడు'' అని వచింప హిరణ్యగర్భుఁడు, ''ఆర్యా! మీపుత్రిక నాస్నుష నుగా, బరిగ్రహించుట కెట్టి యడ్డంకియు లేదు. కాని రాజ పుత్రుఁడు రాజకీయ ప్రాపంచక నూతనవిషయ సంగ్రహార్థము దేశపర్యటన మొనర్చుచు నేటిదనుక పురముచేరమి నావిష యమున నిట్టని వచింపనేర''నన సుదర్శనభట్టు, ''ఆర్యా! నా యభీష్టములలో నొకటి ఫలించె. రెండవదియు ఫలప్రాయము. మీకు నా ధన్యవాదములు. నాకు ధర్మవర్ధన దర్శనభాగ్యము కల్గింపుఁడు. వారిని దర్శించి రాజపుత్రుని ఛాయాపటమర్థించి మా ప్రభునకుఁ జూపెద. రాజపుత్రుఁడు నేడు లేకున్న ననతి కాలమునఁ బురమున కేతెంచు'' ననెను.

హిరణ్యగర్భుఁడు: రేపటిదినమునఁ బ్రభుని సందర్శింపనగు. మీయభీష్ట మీడేరుగాక.

మఱునాఁడు సుదర్శనుఁడు హిరణ్యగర్భునితోఁ గూడ రాజ సభ కేగి రాజసన్మానితుఁడై తానరుదెంచిన కార్యవృత్తాం తము ధర్మవర్ధన మహీపాలునకుఁ దెలియఁ బల్కె.

ధర్మవర్ధనుఁడు: భూసురోత్తమా! నాపుత్రుఁడగు మోహ నాంగుఁడు దైవిక, రాజకీయ చారిత్రాత్మక జ్ఞాన సంపాదనార్థ

మును ప్రకృతి రామణీయక సందర్శనార్థము దేశపర్యటన మాచరింపుచున్నవాఁడు. అనతికాలమున రానున్నవాఁడు. మీ రాజపుత్రికా ఛాయాపటము నీతోనుండిన (నీవు గొని వచ్చిన) కాన్పింపుము. సమ్మతమగునేని నాతనూభవు ఛాయాపటము నిచ్చెద.

సుదర్శనుఁడు : ప్రభువర్యా! అట్ల యగుఁగాక. ప్రభుచిత్త మెట్లున్న నటులఁ గావింపనగునని కమలావతియొక్క చిత్తరు వును ధర్మవర్ధనున కొసగె.

ధర్మమహీపాలుఁడు కమలావతి చిత్తరువును జేతఁబట్టి చూచి యంతరంగమునఁ గడు నలరి తన పుత్రుని చిత్తరు వునుగూడ వేఱొకచేత నిడికొని పరీక్షింపుచు "ఇట్టి బాలా మణి నా కోడలగుటకంటె భాగ్యాంతరము కలదా! దైవ సంఘటన మెటుల నున్నదో? ఏటి కెఱుక. వివాహములన్నఁ బుట్టువతోడనఁ దైవనిశ్చితములు. అజ్ఞానావృతు లగుటచే మానవులు దాని గుర్తింపనేరక పలుయత్నము లాచరింతురు. పరమేశ్వరానుకూల్యము కల్గుచోఁ దప్పక యీ బాలిక నా కోడలు కాఁగలదు." అని మనమునఁ దలపోసి తన యంగీ కారసూచకముగ మోహనాంగుని చిత్తరువును సుదర్శనున కిచ్చె. సుదర్శనుఁడు కడు సంతసించి రాజాజ్ఞఁగొని హిరణ్య గర్భునితోఁగూడ గృహముచేరె. నాటిమధ్యాహ్నమున సుద ర్శనుఁడు స్వపురమున కేగుటకు హిరణ్యగర్భుని వేడ నాతఁ డంగీకరింపమి నాదినమచటనుండి మఱునాఁడు హిరణ్యగర్భు నంగీకారమునఁ దనపురము చేరి రాజగు పూర్ణచంద్రుని

దర్శించి రాజసన్మానితుఁడై యా యా దేశ రాజపుత్రుల చిత్తరవులు ప్రభున కొసగి.

ఉ. చూచితి పెక్కు దేశములు చోద్యముగా గనుపట్టుచుండె నా
చూచిన రాజపుత్రకులు శోభవిహీనులు రూపశూన్యులున్
నీచప్రవర్తనుల్లనగ నేఱిమిమీఱగ నిశ్చయించి యీ
కాంచనరాజపుత్రికకు గాంచితి భర్తగ సర్వలక్షణున్.

అని పలుకఁ బూర్ణచంద్రుఁడా ఛాయాపటముల నొక్కొక దానిని దిలకించుచు మోహనాంగుని చిత్తరువును గాంచి యత్యంతానురాగమునఁ బరీక్షింపుచుండ సుదర్శనభట్టు రాజు చెంతఁజేరి "ఈతఁడుహో మణిపురాధీశపుత్రుఁడు. వాంఛనీయ సర్వలక్షణలక్షితుఁడు. కమలావతి కనురూపుఁడు. కాని యీ రాకుమారుఁడు దర్శనీయవస్తువిషయక జ్ఞాన సంపాదనార్థము దేశసంచార మొనర్చుటకై పురము వీడె. శీఘ్రకాలమున రానున్నవాఁడు. ఎట్లైన వాని చిత్తరువుగొనిరా నిచ్చపడమి గొనివచ్చితి" అనిపల్కె. పిదప రాజానుమతంబున స్వగృహమున కేగె. అంత నాతనియర్థాంగి యనసూయ శీతలోపచారముల విభుని శాంతచిత్తుఁ గావించి యత్యాదరమునఁ దన పుత్రికయగు పద్మావతీ పరిణయమును గూర్చి ముచ్చటింప మణిపురాధివాసియగు హిరణ్యగర్భుని పుత్రుఁడగు కమలమిత్రునకిచ్చుట లోనగు సర్వము నెఱింగించె. ఆనాఁడు రాజభవనమును బ్రాహ్మణ గృహమును దమపుత్రికా పాణిగ్రహణ వృత సమాలోచనా రావ సంకులమయ్యె.

## ఆఱవ ప్రకరణము

### అంగీకారము

మోహనాంగుఁడు విద్వాంసుఁడై గురువుల చెంతనుండి రాజభవనమున కేతెంచె. మున్ముందు తా రాజ్యపాలకుఁడు కానుండుటచే నట్టి కార్యారంభమునకు పూర్వము ఉత్తమ చక్రవర్తుల పరిపాలనా విధానము. ప్రాచీన రాజశ్రేష్ఠుల చారిత్రక విషయములు. దేశాచారములు. సృష్టివైచిత్ర్యక (ప్రకృతి రామణీయక) వస్తువిషయక జ్ఞానము ప్రధానములై యుండనోపు. కేవల శాస్త్రాభ్యసన జ్ఞానము ప్రయోజనకారి కానేరదని యుఖండాంతరీయులును రాజు శాస్త్రజ్ఞానము కలవాఁడయ్యు ననుభవ జ్ఞాన విహీనుడగునేని రాజ్యాధిపతిగాఁ జేయనిచ్ఛగింపరు గావున నొరులు శాసింప కుండగనే మనము దేశపర్యటనమున ప్రాపంచికజ్ఞాన మలవఱచుకొనుటయుత్తమ పక్షమను తలంపు కలవాఁడై యుండె.

ధర్మవర్ధనుఁడన్న నో వయోవృద్ధుఁడు. యువరాజునకు రాజ్యాభిషేక మొనర్చి దా విశ్రాంతిగొని చూచి యానందింత మనెడి కోర్కె కలవాఁడు.

ఒకనాఁడు మోహనాంగుఁడు తండ్రియగు ధర్మవర్ధనుని సమీపించి "జనకా! నేనుశాస్త్రజన్య జ్ఞానము కలవాఁడ నయ్యు ప్రాపంచక జ్ఞాన విరహితుఁడను. బహుదేశాటనము బహుశ్రుతులతో నిరంతర సాంగత్యము మానవున కెట్టి

వానికేని జ్ఞానము పుట్టించును. అట్టిజ్ఞానము కల్గినవాఁడు జనరంజకముగ రాజ్యపాలనా సమర్థుఁడు కానోపు. దయతో దేశ సంచారమున కనుమతిండ'' న, రాజున కంగీకారము లేకున్నను మోహనాంగునకు త్సాహభంగము కావింపనొల్లక యంగీకార సూచకముగ శిరః కంపము గావించి వాని నంపి ఆలోచనా నిమగ్నుఁడై మంత్రియగు సుబుద్ధినిగొనిరా సన్నిధానవర్తియగు నగ్నిమిత్రు నాజ్ఞాపించియంపె. ఆతఁడు సచివు చెంతకేగి ప్రభునాజ్ఞ విన్నవింప మంత్రియగు సుబుద్ధి దా రాజు చెంతనుండి ఘటికాద్వయమునకు ముందుగనే వచ్చుటయు నీ యల్పకాలముననే ప్రభువు తన్ను రాజాస్థానము రా నాజ్ఞాపించుటయు యోచించి కారణ మారయనేరక "రాజసేవ మానవునకు మిక్కిలి కష్టదాయకము. అయ్యది సింహమును కౌగలించుట, సర్పముఖమును ముద్దిడుట కత్తి దారును నాకుట, మొదలగు వానితో సమానము. "యద్భావి తద్భవత్యేవ" ఏయది కానుండెనో యది కాక మానదు. మన మేల నాత్రము చెందవలయు" అని తలచి రాజధర్మనోచిత కంచు కవసనోష్ణీషధారియై రాజు చెంత కేగె.

• సుబుద్ధి: 'ప్రభూత్తమా! ఈ తరుణమునఁ బ్రభువు లాస్థానమునకు రప్పించుటలో నగు కారణ మూహింపనేరక సంశయాకులిత చిత్తుఁడనై తి. ప్రయోజన మానతిండు.

ధర్మవర్ధనుఁడు: సచివాగ్రణీ, మోహనాంగుఁడు దేశపర్యటనమున కేగ నంగీకారమర్థించె. నేనన్నో వానియందు రాజ్యపాలనా భారమిడి విశ్రాంతిగొని సుఖజీవనము చేయఁ గోరుచున్నాను. తాను మనః క్లేశ మొందకుండుటకై వాని

ప్రార్థన మంగీకరించితివిగాని మనస్సు తత్తరపాటు చెందు చున్నది. సాధ్యమగుచో వానిబుద్ధి మరల్పుము.

సుబుద్ధి రాజాజ్ఞగొని మోహనాంగుని సౌధమున కేగి తత్సన్నానితుండై "కుమారా! మోహనాంగా! నీవు నేటి వఱకు గురువులచెంత విద్యనభ్యసించి గృహముచేరితివి. ప్రపంచ పర్యటనాసక్తుండవైనటుల వినియుంటిని. ప్రతిమానవుండును జ్ఞానసంపాదనార్థము దేశపర్యటన మొనర్చుట ప్రధానము. కాని యేకార్యాచరణమునకైనను దేశకాలములు ప్రధానములు. తండ్రిగారు వయోవృద్ధులగుటచే నీవు రాజ్యభారమూని వారలకు విశ్రాంతినొసగి యానందింపఁజేయుటయుఁ గొంతకాల మతిక్రమించిన పిదప దేశసంచారము గావించుటయు నా కుచితములుగా గోచరించు చున్నది. నీయాశయ మేమి?" అనిపల్కునంత మోహనాంగుఁడు మాఱు వలుకకయ మిన్నకుండె. మోము దమ్మి వైవర్ణ్యమొందె. శరీరము స్వేదజలావృతమయ్యె. తోడన మంత్రి సుబుద్ధి "కుమారా, మోహనాంగా! 'ఆకారైస్త్వ విబుధాస్స్వర్కయంతి పరేంగితమ్' అనునటుల జ్ఞానులౌరుని యాకార సందర్శన మాత్రముననే యెదుటివారి మనోభావము గుర్తింతురని' చెప్పెదరు. నీయాకారముననే యీభావము గుర్తించితి. నీవొక్కడవు పోఁదగదు. నీమిత్రుఁడగు చంద్రపాలుని గూడ నీతో నంపెద. ఏగుఁడు. విశేషములారసి శీఘ్రమరండు" అనిపలికి రాజగు ధర్మవర్ధనుని చెంత కేగి "రాజేంద్రా! మోహనాంగు నభీష్టము ననువర్తింపుఁడు. ఆతఁడు శీఘ్రకాలమునఁ జక్రవర్తి కానుండె. తత్పూర్వ మయా దేశముల కేగి యచటి

పరిపాలనావిధానము, ప్రజాహిత కార్యాచరణ కౌశల్యము, చారిత్ర ప్రధానకస్థల సందర్శనము, దివ్యక్షేత్ర సందర్శన పుణ్య జలావగాహనాదికము, మున్నగు వానిమూలమున ప్రాపంచిక జ్ఞానవంతుఁడగును. ఇట్టుల దేశపర్యటన మొనర్చుటలో దేశతాదర్శనము మనస్థైర్యము ఏకాగ్రచిత్తత పుణ్య జలావ గాహనమున నాత్మ పునీనతయుఁ జేకూఱును. కావున నీవిషయమున సంశయింపక దేశసంచారమున కంపనగు''నని పల్క ధర్మవర్ధనుఁడు మంత్రిబోధనమునకలరి మోహనాంగు దేశపర్యటనమున కనుపఁ గృతనిశ్చయుఁడయ్యె. ధర్మవర్ధనుఁ డీయుదంతము కళావతి కెఱిగించి యెట్టకేలకామె నొడఁబఱచి పుత్రు మోహనాంగుఁ జంద్రపాల సహాయునిగా దేశ సంచారమున కంపె.

## ఏడవ ప్రకరణము

## దేశపర్యటనము

వెంకటవరాహనాంగుఁడు వేగజితపవనంబులగు సైంధవంబుల నధిరోహించి చంద్రపాలునితోఁగూడ బయనమై యుత్తమ రాజపుత్ర పరిపాలిత సంస్థానముల సందర్శింపనెంచి ఉత్తర హిందూస్థానమందలి ఉదయపూర్ (ఉదయపురము) బరోడా మున్నగు సంస్థానముల కేగి యందలి ప్రజాసౌకర్యార్థము ప్రభు వొనర్చెడివాని నెల్ల గ్రహించియు నవద్వీపము, తపోధన నివాసమగు హరిద్వారము, ఆదర్శవిద్యాపీఠమగు ఋషీకేశము, సర్వకళా పరిషత్కార్యస్థానమగు వ్యాస పీఠము, నలంద, తక్షశిల మున్నగు విద్యాపీఠముల సందర్శించి యచ్చటి విద్యావిధానము దెలిసికొని కాసీ ప్రయాగ మున్నగు ప్రదేశముల కేగి శివకేశవుల సందర్శించి ప్రయాగలోని త్రివేణీ సంగమస్థానమున స్నానమొనర్చి, కాసికానగర మున మణికర్ణికాఘట్టమున సకలపాప సంహారిణి యగు గంగాతరంగిణియందుఁ గ్రుంకులిడి విశ్వేశ్వరాన్నపూర్ణాది దేవతాయతనముల కేగి యాయా దేవతల సందర్శించి 'దేహి మాతృగర్భములో నెన్ని మాసములుండునో యన్నిదినములు వారణాసియందు వసింపవలె' ననెడి నియమానుగుణముగ తొమ్మిదిదినము లందుండి యయోధ్య బృందావనము మొదలగు నుత్తరదిక్కునందలి ప్రధానక్షేత్రముల కేగి దక్షిణదిశ యందలి సంస్థాన దేవాయతనపుణ్యనదీ సందర్శనాభిలాష

ప్రోత్సహింపఁ జంద్రపాలునితోఁగూడ అశ్వారూఢులై దిన మున కొక 50 మైళ్ళదూరము పోవుచు నొకనాటి సాయం సమయమునకుఁ గాంచనగర ప్రాంతము చేరిరి. ఆతరుణమునఁ దన్నగరాధీశు ననుంగుపుత్రిక యగు కమలావతి సఖీజన సమే తముగ నుపవనవిహార మొనర్చి పురమున కేగుచు నుత్త మాశ్వములపైఁ బయన మొనర్చుచున్న మోహనాంగుని గాంచి రూపసమాకృష్టచిత్తయై యా యువకునియందు లగ్న మనస్కయై యాతని యాకృతినే స్మరింపుచు హృదయఫలక మునఁ జిత్రించుచుఁ బురముచేరె. మోహనాంగుఁడన్నో విద్యుల్లతవోలెఁ గనుల మిఱుమిట్లుఁగొలుపు దేహశోభతో విరాజిల్లు కమలావతిని జూచియుఁ దాఁగనుగొనినటులఁ జంద్ర పాలున కెఱిగింపక యానాఁడానగరమందుండి నిశాంతము నం దెప్పటియట్ల గోదావరీతీరమందలి పంచవటి భద్రా చలము మున్నగు దివ్యక్షేత్రములను, అజంత, ఎల్లోరాగుహ యందలి బౌద్ధశిల్పకౌశలమును, భక్తవరేణ్యుండగు రామ దాసుని చరిత్రను దెలిపెడి గొల్లలకొండ (గోల్కొండ) ను, శౌర్యనిధియగు ప్రతాపరుద్రమహీపాల పరిపాలితమగు ఓరు గల్లు (వరంగల్లు) నందు మేధానిధియు నమాత్యశేఖరుండగు యుగంధరునియొక్కయు, భక్తాగ్రగణ్యుండు కవితల్లజుండు నగు పోతనామాత్యు చరిత్రమును, చారిత్రాత్మకమగు కొండ పల్లి కిల్లాను, విజయుని తపోస్థానమగు నింద్రకీలపర్వతమును, కృష్ణాతరంగిణీ వీచికా మందమారుతమున నాహ్లాదమొనఁ గూర్చు నాంధ్రదేశ కేంద్రస్థానమగు విజయవాడ (బెజ వాడ) ను, తత్తరంగిణీతీరస్థ బౌద్ధచరిత్ర సుప్రసిద్ధమును,

బౌద్ధవిశ్వవిద్యాలయ ప్రధానస్థానమగు నమరావతీ పట్టణ మును బ్రయాణ మొనర్చిరి. ఇట్లు గతిపయమాసముల దక్షిణదిశ కే బోవుచు జారిత్రక సుప్రసిద్ధమును దుంగభద్రా తరంగిణీతీర స్థితమగు విజయనగరమును జేరి సారస్వత, కవి పోషకమున నపరభోజుఁడను బ్రఖ్యాతిగాంచిన కృష్ణదేవరాయ సార్వభౌముని రాజ్యాంగ విధానమునందలి విశేషములఁ దెలిసికొని సమీపస్థ హంపీక్షేత్రమున విరూపాక్షుని సందర్శించి శ్రీరంగము, కంచి, శ్రీశైలము, వెంకటాచలము, క్రమముగఁ గావేరీనదీతీర స్థలములగు కుంభకోణము, దక్షిణాపథమున గానవిద్యాప్రదాతయు భక్తిప్రపూర్ణుఁడగు త్యాగయ్యభాగవతారుని వాసస్థానమగు తంజావూరు మున్నగుదివ్య క్షేత్రములకేగి యందలి దైవతముల సందర్శించె. సుప్రసిద్ధ పత్తనములఁ గనుగొనుచు నఁదొక నగరమున సౌధరాజమును దిలకించి "అహా! ఆశ్చర్యము. ఈ సౌధము మిన్ను ముట్టుచున్నది. సింగారమా వర్ణనాతీతము"ని మోహనాంగ చంద్రపాలురు ముచ్చటించుచుండఁ దటిల్లతికవోలె విరాజమానయగు నొకానొక యువతీమణి సఖీసమేతయై సోపాన మార్గము సౌధోపరిభాగమున కేగుచుండె. మోహనాంగుఁడు చంద్రపాలునకా దృశ్యమును జూపించి ఆ జవ్వనిని సృష్టించుటలోఁ గల కమలగర్భుని చతురత (నైపుణ్యము) పలుతెఱగుల స్తుతింపుచుండ మంత్రి పుత్రుఁడగు చంద్రపాలుఁడు "మిత్రమా! ఈ యాకృతిని జూచినంతనే యిట్ల క్కజపాటొందనేల? పద్మాసనుని సృష్టివైచిత్రము వర్ణనాతీతము. మున్ను మన మిర్వురము కాంచ నగరమున కేగు నెడ నొక యువతీమణి దృగ్గోచరయయ్యె. ఆ యువతీమణిని

గాంచిన మోహినీరూపము దాల్చి యింద్రియ విజేయుని ప్రసిద్ధిగన్న పరమేశ్వరుని సైతము బలుభాముల పాలొనర్చిన పద్మనేత్రుండైనం దన్ను వరింపుమని యీ బాలామణి పాదాక్రాంతుడు గాకుండునా? ఇటులనే యొకదాని మీఱు వేఱొక యీ కృతిని సృజించుచుండు. అత డిచ్ఛామాత్రముననే భావనానుగుణముగ సృష్టిచేయుచుండు. ఆతని నైపుణ్యము భావనాతీతము. ఆ జవరాలి గాంచిన యే మానవుండేని యన్యకాంతల రోయకుండునా? చతురాననుం డాపె నెవ్వాని కర్థాంగిగఁ గూర్ప నెంచెనో యాతని జీవితమే ధన్యము'' అని వచించు చంద్రపాలుని పలుకుల కాత్మ నలరి, అట్టి యువతి తన యర్థాంగియైన నుత్తమమని తలంచి తన యాశయముఁ మిత్రున కెఱిగింప యువరాజుకోర్కె.యెఱింగిన చంద్రపాలుడాదిశ దర్శనీయము నెల్ల శీఘ్రమునఁ బూర్తి చేయించి మిత్రుండగు మోహనాంగునితోఁ గూడఁ గతిపయ దినములలోఁ గాంచనగిరి చేరి ప్రచ్ఛన్నవేషమునఁ బురిసొచ్చి యానాటి సాయంకాలము నుపవనమున కేగుచున్న మన కథానాయిక యగు కమలావతిఁ గాంచిరి. తోడన మోహనాంగుఁడు కుసుమాస్త్ర శరతాడితాంతరంగుఁడై ''మిత్రమా! నాటి నీ పల్కులు నిక్కవములు. అంగసౌష్టవమా, నారీలోకామృగ్యము. ముఖమా చంద్రుని ధిక్కరించు (చంద్రాపహాసము). నేత్రములన్న నాకర్ణాంతములు. వేణీభరమన్న నోమదబంభరవి జేతము. తనూవల్లిక సువర్ణ శోభాపహాసిని. ఏ తెఱగునైన నీ యువతి నా యర్థాంగిగా యత్నింపు.'' మన

చంద్రపాలుఁడు, "మిత్రమా! ఏ కార్యసిద్ధికైన కాలము ప్రధానము. యత్నమొనర్తు. మన యత్నమునకు దైవము తోడ్పడిన ననతికాలమున ఫలసిద్ధియగు. శ్రీపతి నీ యభీష్టము ఫలవంతమొనర్చుగాక" అని పల్కి యా దినశేషమా నగరమున గడపి క్రమముగ వారణాసి చేరి యందుఁ గొంతకాలమవసింప నెంచిరి.

# ఎనిమిదవ ప్రకరణము

## కమలావతీ వనవిహారము

ఈయుపవన రామణీయకము వర్ణనాతీతము. పుష్పోప శోభిత చంపక పారుజాత, కరవీర, కుంద, మందారాది సుమ ప్రధాన తరులతోడను కురువక మాలతీ, జాజి, మల్లిమతల్లి వి రాజకాయమానాచ్ఛాదిత వేదికాతలములతోడను, నారంగ, రంభా, నారికేళాది వివిధఫల వృక్షములతోడను, గొజ్జంగి పొదలతోడను వివిధకృత్రిమ చిత్రప్రతిమలతోడను, ప్రతిమా రూప మానవ ముఖోర్జిత జలయంత్రముల తోడను విరాజ మానంబై యుండెను.

గంధవహుఁడు సార్థకనాముఁడై మందగమనమున ద్రష్టలఁ దనియఁ బఱచుచుండె. కుసుమసౌరభముల నాప్రదేశమంతయు సుఖావహామయ్యె. ఇట్టియుపవనమునఁ గమలావతి సఖీసమేతయై కుసుమాపచయ మొనర్చుచుండె.

కమలావతి : కీరవాణీ! కంటివే. ఈ లతామతల్లిక, తదను రూపవృక్షరాజము నల్లిబిల్లిగ నల్లుకొని యెట్లు నేత్రపర్వ మొనర్చుచున్నదో!

కీరవాణి : అక్కా, కంటి. నీవాక్కు నిక్కువము. కాని యిది నాకంతగ ముదము కూర్పకున్నది. ఈ పుష్పలతికవోలెఁ గుసుమకోమలాంగివగు నీవు గుణరూపవిద్యావయోసంపన్నుఁ డగు రాకుమారుఁ గరగ్రహణ మొనర్చి వానిచెంత మెలఁగు నాఁడీ దృశ్య మానందదాయక మగు.

సుగుణమణి : కీరవాణీ! ఈప్సిత మనతికాలముననే ఫలించు లక్షణములు గోచరించుచున్నవి. కంటివే, ఆ భ్రమరరాజము

మన సఖురాలి మోము దమ్మిఁజేరి మధువునాన యత్నింపు చున్నది.

కమలావతి వారిపల్కుల కాత్మానందమొందియు నించుక కోప మభినయించి. "నే లతాసౌందర్యము మీకుఁ జూప మీరు నన్నిటు లపహసింప నగునా? నన్నువీడి మీయిచ్చ వచ్చిన తెఱగు మీ రేగుఁడు. మీతోడ రానోప." అని పలుకుచు వేడిచూపులఁ జుఱఁ జుఱఁ జూచుచు వారలవీడి కొండొక తావున కేగుచుండె.

కీరవాణి సుగుణమణులు: నెచ్చెలీ! మా కోర్కె నెఱిగించిన మాత్రాన నిటులఁ గోపింపనగునా? శాశ్వతముగఁ గన్యాత్వ మంగీకరింతువా? తగినవరుడు లభించినఁ జేపట్టకుందువా? మామాటలలోఁగల దోషమేమి? నీ మనసునకు రుచింపకున్న మిన్నకుందుము. రా రమ్ము. కుసుమాపచయమున నలసినారము. మేనఁ జెఱుచెమ్మటలు గ్రమ్మె. శీఘ్రముగఁ జలకేళిఁ గావింతము.

కమలావతి: మీరు మాటిమాటికి నెకసక్కములాడుచు నన్నలయించు చుంటిరి. నేనీ మాధవీమండపమున నుందు. మీ రేగి మీయిష్టానుసారము జలకేళి గావింపుఁడు.

సుగుణమణి: సఖీ! నీవులేనిచో నెందేగిన మాకేమి యానందము. మనమందఱ మటకేగి నీటియాటలాడి పురమునకుఁ బోవుదము. దినకరుఁడు తనయరుణకరసహస్రముచేఁ బశ్చిమదిగంగనమోము విన్నదనమువాపి యానెనలరింపఁ జేయుచున్నాడు.. పురమునకేగు తరుణ మాసన్న మయ్యెనని యనునయించె.

తుదకుఁ గమలావతి వారికోర్కెలఁ ద్రోసి పుచ్చనొల్లక వారితోడ సరోవర తీరము చేరి చిఱుత వసన ధారిణులై జల కేళి యొనర్చి తీరముచేరి తమతమ వసనధారిణులై తామే తెంచిన యశ్వశకటములపై నగరమున కేగుచు నా తరుణమున వేగజిత కురంగములగు తురంగముల వాహ్యాళికై యామార్గమున నేగుచున్న మోహనాంగ చంద్రపాలురఁగాంచి యందు నాజానుబాహుఁడును విశాలవక్షుడు నాకర్ణాంత నేత్రుఁడగు మోహనాంగునిగాంచి తొల్లిఁదాఁ గాంచిన సుందర విగ్రహుని దిర్గిసందర్శించు భాగ్యము కల్గెనని మనమున సంతసించి యట్టిభాగ్యము చేకూర్చిన భగవానుని మనసార ధ్యానించి తల్లావణ్యాకృష్ట చిత్తయై "ఆహా! ఈ యువకుఁడే దేని యొక దేశపు రాకుమారుడై యుండనోపునో? ఈతని పాలనమున నేమానవులు సుఖజీవనముచేయ నుంటిరో? ఈతఁ డవివాహితుఁడై యుండునో, లేక యేధన్యురాలైన వీని పాణిగ్రహణలాభ మొందియుండునో యైన నగుఁగాక. 'రాజానో బహువల్లభాః' అని శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. వీని పాణిగ్రహణ మొనర్చిన నాతియొకతియే ధన్యురాల"ని తలపోయుచు నగరమున కేగి వాసభవనముచేరె.

# తొమ్మిదవ ప్రకరణము

## పర్యాలోచనము

"అహో, దినములు, వారములు, పక్షములు, మాసము లతిక్రమించుచున్నవి. కాని దేశపర్యటనమున కేగిన చిరంజీవి రాడయ్యె. వచ్చెదనని నియతికాలమూ అతిక్రమించె. తమ యుత్సాహపు దృష్టితక్క నింటఁ దనపైఁ బ్రాణములు పెట్టి కొనియున్న వృద్ధుల మమ్ము స్మరింపఁడయ్యె. తానురాకున్న రాకపోవుఁగాక. తా వెడలిన ప్రదేశములు తాఁగాంచిన దృశ్యములఁ నెఱిగించుచు స్వయముగ తఱచు లేఖల వ్రాయకుండెనే? విద్యాభ్యాసన కాలమునాటినుండియు దేశీయులు, పౌరజానపదులు, సామంతరాజులు, 'మోహనాంగుఁ డెన్నఁడు విద్యను బూర్తిగావించునో, ఎన్నఁడు ప్రభువై మనలఁ బాలించునో, అట్టి నూతన ప్రభునిబడసి యితోధికసుఖముల నెన్నఁడనుభవింతుమో' అని దినములు నెన్నుచుండిరే? వారి కోర్కెనైనఁ బాటింపకుండెనే. వృద్ధులమగుటయు, లేక లేక కల్గిన సంతానమగుటయు నట్టివానిపై రాజ్యపాలనా భారమిడి విశ్రాంతిగాని సుఖజీవనము చేయుచు నానందింత మను మన కోర్కె మిగుల దూరమగుచున్నది. వానికేల నిట్టికుబుద్ధి జనించె. అహో, చిన్నవానినన నేల?" అని జ్ఞానేంద్రియము తెఱచి "దేహితత్తత్కర్మానుగుణముగ నాయా ఫలముల ననుభవించును. మానవులు మాయావ్యతిచేతస్కులై యజ్ఞానమున భగవంతుని దూఱుదురు. ఏమి నా యీ యజ్ఞత. భగవంతుఁ

డు దయామయుఁడు. సర్వసముఁడు. ఆతని లీలలు జ్ఞానులు తక్క సామాన్యమానవులు దెలిసికొనఁజాలరు. ఆతఁడు సాక్షిభూతుఁడై దేహికిఁ గర్మానుగుణమగు ఫలమునొసగు. ఇట్టి యెడఁ బాటున కేదియో దుష్కర్మ కారణమైయుండనోపు. మనమట్టిదుష్కర్మ విముక్తికై సర్వలోక శరణ్యుఁడగు పరమేశుని ధ్యానింపుచున్న నత్యల్పకాలమున పుత్రముఖ సందర్శన లాభము సంభవించును.'' అని తన యర్థాంగికి బోధించి నాటినుండియు దేవదేవు మనసార ధ్యానింపుచుఁ బుత్రముఖ సందర్శన దినాగమునమునకై యెదురు చూచుచుండిరి.

పదియవ ప్రకరణము

## దురాశయము

చంద్రగిర్యధి నాయకుఁడగు దుష్టబుద్ధి క్రూరసత్వ సంహా నన కుతూహలుఁడై శర, శరాసనభల్ల ప్రముఖాయుధ ధారులగు వీరుల తోడను, వలలు లోనగు సాధనములతోఁగూడిన కిరాత బర్బరాది యాటవికులతోడను సూర్యరశ్మియుఁ జొఱ నశక్యంబును బంచానన పుండరీక వరాహాది దుష్టమృగ శరణ్యంబగు నరణ్యంబు ప్రవేశించి వివిధ నినాదముల నాయరణ్యంబు కలగుండు పడుప నాజ్ఞాపింప వాని యనుచరులట్టులఁ గావించిరి. తద్దారుణారావమునకు భీతిల్లి జంతుసంతానములు దెసలకుఁ బర్వులిడుచుండ నాయుధధారియగు దుష్టబుద్ధి, మువ్వన్నె మెకంబులు, ద్వీపంబులు లోనగు జంతు సంతానమును వెన్నవిలి సమయించె. భటులును దమతమ యంత్ర సాధనముల సాహాయ్యమున వివిధ మృగముల మడియించిరి. ఈ తెఱగున యామమాత్రావశిష్ట దినమంతయు మృగసంహారణమొనర్చి పురమునకేగుచు కాంచన నగర ప్రాంతభాగమున మన కథానాయికను గమలావతిని దక్కుదవ్వులఁగాంచి త్రిజగన్మోహన జనకంబగు నామె సౌందర్యముగాంచి యచ్చెరువంది "ఆహా! ఈ యువతి యెవ్వతెయొ యుండనోపు? ఇట్టి పడంతిని పాణిగ్రహణ మొనర్చిన వానిజీవితమే ధన్యము. వేయేల? నేనెటులనైన నీనాతి నాయర్ధాంగిని గావించుకొని యెద. ఈకార్యసిద్ధికై నాప్రాణములనైన సరకుసేయక యత్నించెద. పట్టుదలతోఁ బనిచేసిన కార్యసిద్ధికాకుండునే?" అని

తలచి యానాఁడు కాల మతిక్రమించెనని వగచి యెట్టెటో యాదివసము గడిపి మఱునాడీవృత్తాంత మేరికి నెఱుక పఱుప కయే యొంటిగ బయలుదేరి కాంచన నగరమందలి ప్రమదా వనములోనికేగి యందొక పొదమాటున దాఁగియుండి కమలా వతీ సందర్శనమునకై తహతహనొందుచు క్షణమొక యుగ ముగాఁ గడుపుచుండెను. కమలావతి యెప్పటియట్ల సఖీసమే తయై వనమునొచ్చి ప్రత్యేకముగఁ దా నందలి విశేషములు దిలకించుచుండె. నెచ్చెలులును వేర్వేఱు మార్గములఁ బట్టిరి. కమలావతి యందొక లతాగృహముచెంత మాటుపడిన దేహ ముగల దుష్టబుద్ధిని గాంచి వాని యందుండి బయిటికి రా నాజ్ఞాపింప నాతఁడు పొదవీడి బయట నిలిచె.

కమలావతి : ఓయీ నీవెవడవు? ఇది ప్రమదావనమనియు నింపు పురుషులు చొరరాదనియు నెఱుంగకుంటివా?

దుష్టబుద్ధి: నే చంద్రగిరి పాలకుఁడ. దుష్టబుద్ధియనువాఁడ. ఏకాంతమున నీతో మాటాడ నెంచి వచ్చినాఁడ.

కమలావతి : ఛీ, దురాత్మా ! నీవర్తనము నీపేరునందే ప్రతిఫలించుచున్నది. ఆ చెప్ప నెంచెడి మాటలేమి?

దుష్టబుద్ధి: యువతీ! అట్లేల కోపించెదవు. ఇట్టినీవు నాపట్ల కెట్లు విచారింతువు. శాంతముతో నాలింపుము. నిన్నటి సాయంసమయమున నినుగాంచిన దాదిగ మదనుఁ డుగ్రుఁడై వాడితూపులు నాపై ప్రయోగించుచుండె. మన్మథశరాగ్ని దంద హ్యమానమగు నా దేహతాపము నీప్రేమవాహినిని వెల్లి గొలిపి శాంతి పఱపుము. అట్లైన నా దేహతాప ముపశమించు.

నీవు పట్టమహిషివి కానోపుదువు? నీ ప్రేమవాహిని విరియఁ జేసి దేహతాప ముడిగింపుము.

కమలావతి : నిన్ను ప్రేమించిన వారియెడ నీ యనుచయ వాక్యముల వెదజల్లుము. నీవు చోరునిభంగి నీ యుపవనము చొచ్చితివి. దండనార్హుఁడవు. జీవహింసకుపూన నిచ్ఛగింపక నిన్ను ప్రాణములతో విడుచుచున్నాను. యుక్తా యుక్త జ్ఞానములేక మద్యపానోన్మత్తునికై వడి ప్రలాపింపక యీ ప్రదేశము వీడి పొమ్ము.

దుష్టబుద్ధి: కోపోద్రేకుఁడై "ఓసీ! నను సామాన్యునిఁగా నెంచి నీయిచ్ఛవచ్చిన తెఱఁగున వచించుచుంటివి. ఇదియే నా ప్రతిజ్ఞ. నేనీ కార్యమున నసువులకై నను వెనుదీయక యత్నించి నిను నా పాద దాసిగాఁ జేసికొనియెద.

కమలావతి: "ఓరీ దురాత్మా! ఇందు నీబెదరింపులకు వెఱచువారెవరును లేరు. స్త్రీల బలాత్కరింపఁబూనిన యేమానవుఁడు చెడక సుఖమొందెను? సీతనుగొనిపోయిన రావణుఁడే మాయెను? రుక్మిణిని బలిమి పెండ్లియాడ నెంచిన శిశుపాలేగతి నొందె. దుర్యోధనుఁ డెట్టిదశనొందె. నీకును కాలమాసన్నమగుటచే నిట్టిబుద్ధి జనించియుండనోపు. నీతలచినట్టుల నట్టి దిన మెన్నడును రాదు. అట్టి యత్నము నీవాచరించినను ప్రయోజనము లేకుండుటయే కాక వినాశకారణమగు. నేన నీ ప్రాణాపహారిణినై నిను శమనుగృహమున కతిథిగా నొనర్చెద. ఇంక నిందునిలుక వెడలిపొమ్ము. మేము రసపుత్రాంగనలమని గుర్తింపకుంటివేమో. ఇదిగో చూడుము" అని ప్రాణమాన రక్షణారము తమచెంతనుండెడి, భల్లమును ఒఱనుండి పెఱికి

“యింకొ నిందుండి ప్రేలెదవేని యీ ఖడ్గభుజంగికి నీ ప్రాణ వాయువు లాహారముగా జేతు” అని పల్కునంతఁ జేయునది లేక యా ప్రదేశము వీడి కమలావతి నెట్లైనఁ దా వరించు నుపాయాన్వేషణముతో దినములు పుచ్చుచుండె.

## పదునొకండవ ప్రకరణము

### అంతిపురము

మోహనాంగుమోము దమ్మి నేత్రపర్వముగఁ గనినదాదిఁ గమలావతియందు మార వికారములు పొడఁజూపుచుండె. ఎప్పటియట్లుఁ దా సఖులతో సంభాషింపకుండె. పక్షులకు మాటలు చెప్పుట, చిత్తరువులు లిఖించుట, వీణ మీటుట, మొదలగు నిత్యకృత్యముల యందు విముఖయై సర్వకాలముల యందు మోహనాంగు సుందరరూపమునే తలంచుచు రాత్రిం బవళ్లు శయ్యాధిగతయైయుండె. ఆమె యానలేక సఖురాండ్రు లోనికిఁ బోరాదు. ఈ తెఱఁగునఁ గొన్ని దినములుగడిచె. సఖురాండ్రెల్లరు ఖిన్నచిత్తలై మిన్నకుండిరి. కాని యందుఁ గమలావతీ బహిఃప్రాణయై తనరారు వకుళయను చెలియ సాహసించి లోనికరిగి మోహనాంగరూప సమాక్రాంత చిత్తయు విషమాస్త్ర నిశిత శరదండహన్యమానాంగియునై యున్న కమలావతిని సమీపించి "ఆహా ఏమినాయీ సఖియ యెన్నడు నెఱుంగని యిట్టి యిక్కట్టుల పాలగుచున్నది. కతంబు నేరకుంటి. అత్యల్పకాలముననే యింత వివర్ణయయ్యె. ఈమె నిజవృత్తాంతమారసి యందులకై తగు నివారణోపాయ మొనర్పమి యుచితమా?" అని మనమునఁ దలపోసి కమలావతిని సమీపించి "ఓకలభాషిణీ, మరాళగమనా? మమ్మన్యలఁగాఁ దలంచితివేల. నీమనోవేదనా కారణము నెఱింగించినచో మాప్రాణముల నర్పించియైన ఫలము చేకూర్తుము. సంశయింపకుము" అని చనువు బలిముల వినియోగించి వేడె.

అట్లు వేడినను గమలావతి తన యుదంతము వెలిబుచ్చనొల్లక సంశయాక్రాంత చిత్తయై వాతేరిత మేఘమాల వలెనుండె. సారెసారెకు వకుళ నిరోధించి యడుగ నధోముఖయై "తాను ద్యానవన విహారమొనర్చి పురమునకు వచ్చుతఱి యామార్గమున నుత్తమాశ్వారూఢుఁడై పయనము గావించుచున్న రాకుమారుని గాంచిన దాదిగ నాయువకుని దన మనోనాయకునిగాఁ జేసికొన నిచ్ఛపొడముట యానాటినుండియు యనిర్వచనీయమగు తాపము దేహమున నంకురించి పలువెతల పాలొనర్చుటయుఁ దానా సుందరాంగుని రూపజిత మకరకేతుం గాంచకున్న నసువులనిల్పుట యసంభవమనియుఁ దనయుదంతము నెఱిగించె. అంత వకుళ కొంతతడవాలోచించి "హా ఏమి? ఆరాజశేఖరుని పాలనముచే నేదేశీయులు ముదమొందుచున్నారో, ఆపూర్ణ చంద్రోదయమున నేవంశపయః పారావార ముప్పొంగుచుండెనో, ఏ సీమంతినీలలామ, చంద్రుని వలనఁ బ్రాగ్దిశవోలె నా రాకుమారునిచే వెలుగొందెనో, యా మానవేంద్రుని గనుట యెట్లు? అంతియకాక యాతఁడీ మగువ పాణిగ్రహణ మొనర్చుట కియ్యకొనునో లేక మా యత్నములన్నియు లవణాంబుధి శర్కరాపాతములగునో." అని మనమున యోచించి "ఓ ముగుదా? ఈయల్ప కార్యమునకై యింతటి కలవరపాటొంద నేల? నీ యీ త్రిజగన్మోహజనకంబగు రూపముగాంచిన యేమానవుఁడు కుసుమాస్త్రుని విషమాస్త్రశరవ్యమై నీదాసుఁడు కాకుండును. మేము వలయునంత యత్నమొనర్తుము. నీవారాజ పుత్రునాకృతి

నొక చిత్తరువు లిఖింపుము. అద్దాన మనకార్యము సుసాధ్యమగును. వెఱపకుము" అని యూరడింప రాజపుత్రి యించుక ధైర్యమూని చిత్తరువు వ్రాయఁబూనె. కరపద్మములఁ గంప ముదయించె. శరీరమున రోమాంచ మంకురించె. ఆనంద బాష్పములు గన్నుల నావరించె. ఈ తెఱగున నామెయందు సాత్త్విక భావములు పొడమినను నామె యెట్టెటో మోహనాంగుని రూపము లిఖించి యద్దానిఁ జూచుచు నానందవార్ధి నోలలాడుచుండె. వేఁగొండుతఱిఁ జిత్తరువుసమీపమందలి శయ్యపై నుంచి తానచ్చట నెద్దియో యోచింపుచుండ వకుళ సమీపించి చిత్తరువు చూపుమన సిగ్గుచే మోము వాంచి యూరకుండె. వకుళ మిగుల నిరోధించియడుగ నా చిత్తరువును వకుళకు జూపె. నాపె విగ్రహమును సావధానముగఁ దిలకించుచు "ఇట్టి సుందర విగ్రహుఁడగుటచేతనే మా సఖి యవరించె. ఇట్టి పురుషోత్తము డింతవఱకవివాహితుఁడై యుండునా? పరిణయమైన నగుఁగాక "రాజానో బహువల్లభాః" అను న్యాయమున రాజుల కెందఱుభార్యలుండిన నుండనగు. కాని యీ నా నెచ్చెలి యగ్రమహిష్యయో యుండునో లేదో" అనివితర్కింపుచుండె.

కమలావతి : ఓ సఖీ, నీవేల నిట్లు వితర్కింపుచున్నదానవు.

వకుళ : ఈతఁడే దేశాధి నాయకుఁడై యుండునోయనియు నాతనిచెంత కేగి మన యుత్సాహము వెలిబుచ్చుటెట్లొకో యనియుఁ దలపోయు చున్నదాన.

కమలావతి : మీరెన్ని యత్నములచేనైన వానినే ప్రాణనాయకునిగా గూర్తుఁడు. జ్యోత్స్న చంద్రునిదక్క నన్యుల

వరించునా? కమలిని పద్మమిత్రుని వలనఁగాక యితరమగు వానివలన వికాసమొందునా? వేయేల, మీరు వాని నాప్రాణ విభునిగా నొనర్పకున్న మీ యీ సఖురాలు సజీవయైయుండు నని తలంపకుఁడు. తలిదండ్రు లేల? సఖీజనముతోఁడి ప్రయోజన మేమి? ఈలోక మేల?

వకుళ : అనిమేషయై క్షణకాలమూహించి "సఖీ, ఇందు లకై యింత విచార మేల? స్వయంవర వ్యాజమున నా రాకుమారు మనయాస్థానమునకు రప్పింపనగు. అందుసమస్త భూపకుమారుల సమక్షమున నామహీపాల పుత్రువరింప వచ్చు.

కమలావతి : సఖీ, నీ ధీశక్తి కొనియాడఁ దగినది. అట్లైన నాలసింపక కార్యసంఘటన మొనర్పుము. నాప్రాణము నిల్పుము.

వకుళ : సఖీమతల్లీ, కార్యము పండించుకొని వచ్చెద. సెల వొసంగుము. పోయివచ్చెదనని పలికి కన్యాంతఃపురము వీడి పోయె. కమలావతియు వకుళ తనయత్నము సార్థకముగావించు ననెడి యాశతో దినములు గడుపుచుండె.

## పండ్రెడవ ప్రకరణము

## పురప్రవేశము

మోహనాంగుఁడు చంద్రపాల సమేత మాసేతుహిమాచల పర్యంత భూవలయంతయు సంభ్రమించి తీర్థయాత్ర దేశయాత్ర గావించివచ్చిన వారల మంగళతూర్య నాదములఁ గొనిపోవలయుట ఆచారమని యెఱిగినవాఁడగుటచేఁ బురప్రాంతోద్యానమును బ్రవేశింప నేగుచుండె. వనపాలురు రాజపుత్ర మంత్రిపుత్రుల దవ్వుదవ్వులఁ గాంచి యెదురేగి కొని వచ్చి యందున్న వేత్రాసనముల నాసీనులగా వేసిరి. రాకుమారుఁడు వారల ప్రభుభక్తికి సంతసించి "వనపాలకులారా! మీరు పురమునకేగి మా రాక తండ్రిగారి కెఱిగింపుఁడన వారలు ప్రభువాజ్ఞానువర్తులై రాజభవనమునకేగి దౌవ్వారికులమూలమునఁ బ్రభునకీవార్త నెఱిగింప నమృతోపమానంబగు పుత్రాగమనవార్త గొనివచ్చిన వనపాలుర నర్థమునఁ దృప్తిపఱచి యనిపె. పిమ్మట సమీపవర్తియగు భటుని మూలమున నీ యుదంతము మంత్రి సుబుద్ధికిఁ దెలియనంపె. ధర్మవర్ధనుఁడీవార్త యంతఃపురమునకుఁ దెలియనుపఁ గళావతి శ్రోత్రపేయమగు నీ రాగామృతమును గ్రోలి సంతోషాబ్ధిం దేలి "మోహనాంగుని ముఖమెన్నఁడు గాంచితినో, ఉద్యానవనమునకేగిన నచిరకాలమున నేకుమారుముఖచంద్రు నవలోకించి నంతన విశ్లేషక్లేశ మపనయింపనగునుగదా" యని పుత్రసందర్శనమున కువ్విళులూరుచుండె.

రాజభటునివలన నీవార్త వినిన ప్రధాని పురమున నీయుత్సాహవార్త చాటఁబనిచి యాయా శాఖోన్నతోద్యోగుల వారివారి కార్యముల సంసిద్ధ మొనర్చ నానచేసె. తోడన చతురంగబలములు సంసిద్ధములయ్యె. ధర్మవర్ధనుఁడు మంత్రి పురోహితాది పరివారసమేతముగా నుద్యానవనమున కేగ మోహనాంగ చంద్రపాలుర రాజపాదాభివందన మాచరించిరి. వారిద్దర రాజాశీర్వచించి కౌగలించె. చంద్రపాలుఁడు జనకుని చెంత కేగియభివందన మొనర్చ సుబుద్ధివానినక్కునఁజేర్చి సంతసించె. పిమ్మట వారందఱు నందే కొంతతడవు వసించి నగరమున కేగసమకట్టిరి. మోహనాంగ, చంద్రపాలు రిద్దరు తమ తండ్రుల చెంతనుండి వేర్వేఱు రథమ్ములపైఁ బుర ప్రవేశ మొనర్చిరి. రథములు రాజమార్గమున నేగుచుండఁ బౌరాంగనలు పల్వురు సౌధాగ్రములనుండి కుసుమవృష్టి గావించిరి. కొందఱు రామామణులు రజతపళ్ళెరములఁ గర్పూర హారతులెత్తిరి. దర్శనసమాగత జనసమూహముచే రాజమార్గము క్రిక్కిరిసియుండె. ఎట్టెటో రథములు రాజ మార్గమతిక్రమించి ద్వారదేశమునకుఁబోవ మోహనాంగ చంద్రపాలురు రథంబులుడిగ్గి యంతిపురమున కేగి తల్లియగు కళావతికి సాష్టాంగ ప్రణామ మాచరించిరి. కళావతియిద్దర నెత్తి " ఓ బాలకులారా! మిమ్ముఁజూచి యెంతయోకాల మతిక్రమించె. మిమ్ముఁజూచుభాగ్య మీయభాగ్యకుఁగల్గునా? భగవంతుఁడు మాపై నెన్నటికిఁగరుణించి మిమ్ముఁ జూపునో యని నిరీక్షించి విసిగి వేసారి మిమ్ముఁ గనుపఱుప భగవంతు నారాధన మొనర్చుచు నెట్టెటో యసువులనిల్పి మానోముల

ఘంటలగు మిమ్ముఁగాంచితిమి. దేశపర్యటనమున నెట్టిశ్రమల పాల్పడితిరో. మాపూర్వజన్మ సుకృతమున నిప్పటికైన మా కంటఁ బడితి'' రని వారిరువురి దేహములు నిమురుచు ముచ్చటించె. చంద్రపాలుఁడు దేవ్యనుమతిగొని రాజుచెంత కేగి ప్రభు నాజ్ఞను తండ్రియగు సుబుద్ధితో గృహముచేరె.

నాటిరాత్రి భోజనానంతరమున ధర్మవర్ధనుఁడు మోహ నాంగు నాహ్వానించి చెంతనిడుకొని ''కుమారా! నిన్నువీడి చాలాకాలమయ్యె. నీవు ఇలువెడలిన దాదిగ తఱచు లేఖ వ్రాయకుంటివి. నీపర్యటన మూలము నేఁదెలిసికొనఁదగు విశేషములున్న నెఱిగింపుము.

మోహనాంగుఁడు: దేశసంచారముచేఁ దెలిసికొనఁదగు విశేషము లనేకములుండు. అందొక విషయము నుద్దేశించి తమమూలమునఁ దెలిసికొన నెంచియుండఁ దామ ప్రశ్నించుటచే నాకట్టి యవకాశము చిక్కె.

ధర్మవర్ధనుఁడు: సందేహమేల? నా యెఱిగినంతవఱకు నెఱిగింతు. పిదప మనమిర్వురము విచారింతము.

మోహనాంగుఁడు: సంఘనియమములు. సనాతనా చారములని పట్టుపట్టి హిందువులు సజాతీయులఁ బలువుర బహిష్కరించుచున్నారు. అందు ముఖ్యముగాఁ బ్రకృతమున హరిజను లను వారియెడఁగావించిన యన్యాయము నామనసును గలువరింపఁజేయుచున్నది.

ధర్మవర్ధనుఁడు: వత్సా! నీవుచెప్పిన హరిజనులనువారు వేఱుమతస్థులుకారు. వారును హిందువులే. హిందూమతమున

బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రాది భేదమున నాలుగు జాతులుకలవు. ఆ నాల్గుజాతులవారు నాచరింపఁదగు కర్మలు కలవు. ఆ యా జాత్యానుగ విహిత కర్మల నాచరింపనివారల సంఘమునుండి బహిష్కరించు చుండెడివారు. అటుల నా యా జాతులనుండి బహిష్కరింపఁ బడినవారలే నీవుపలికిన హరిజనులు. వారలను స్పృశించుటకును వారితో సంభాషించుటకును సనాతనులిష్టపడరు.

మోహనాంగుఁడు: జనకా! జాతియనియంటిరి. జాతియను నదిపుట్టువుతో సృష్ట్యాదినుండివచ్చిన విషయము కాదుగదా? వారి వారి బుద్ధి కుశలతను వారికార్యనిర్వహశక్తి మున్నగు వాని నాలోచించి వారి వారి వృత్తులనుబట్టియు జాతిభేదము నేర్పఱచిరి. కాని వేఱుకాదు. లోకమున మానవమాత్రునకు దోషమనునది కల్గుట సహజము. అట్టిచో చికిత్సకుఁడు సుస్టాంగము ఖండించి తక్కిన యవయవముల రక్షించిన కైవడి దోషమున్నచో వారిని సంఘమునుండి తొలగించుట కన్న దేహము వ్యాధిగ్రస్థమగుచోఁ దగిన యౌషధమున నా వ్యాధి నిర్మూలించునట్లు దోషము కలవారలకు జ్ఞానోపదేశ మొనర్చి వారిని నిర్దోషులఁ గావించి తమలోఁ గలిసిమెలసి వర్తింపఁజేయ నగుఁగాని బహిష్కరించుట సమంజసముకాదు.

ధర్మవర్థనుఁడు: పుత్రా! నీవువచించినదియు యుక్తము గనే చూపట్టుచున్నది. కాలానుగుణముగ నాచారములును మాఱుచుండును. ప్రకృత ప్రంచమున జాతి ధర్మాచరణమే మృగ్యమగుచున్నది. వారలనుమాత్ర మేల బహిష్కరింప వలెను? వారలలో నేవేని జంతుహింసాది దుష్టకృత్యము

లున్న వారించి పునీతులగుటకు యత్నించి సంఘమునఁ దావి డిన నిడనగు.

మోహనాంగుఁడు : జనకా! తామింకను సంశయించు చుంటి రేల? కొందఱు చక్రవర్తులు తమ యధీనములలోనున్న దేవాలయములకు హరిజనులఁ గొనిపోయి దైవదర్శన మిప్పించుచున్నారు. అట్టితావు లనేకములు కలవు. అందు దోషము లేదని నా యాశయము.

ధర్మవర్ధనుఁడు: వత్సా! మున్ముందు నీవు చక్రవర్తివి కానున్నావు. అట్టితఱి నీవు నట్టిమార్పు చేసినఁ జేయనగు. నీవు మార్గాయాసమున బడలియుంటివి. అర్ధరాత్రము కావచ్చె. పరుండము.'' అని పల్కె. మోహనాంగుఁడు చిత్తము. పోయివచ్చెదనని వాసభవనమున కేగె.

ధర్మవర్ధనుఁడు: ఆహా! ఈకాలమున నెట్టిమార్పులు కల్గు చున్నవి. నవ్యయువకులకు ప్రాచీన సాంప్రదాయములు రుచించునా? కాలప్రవాహమున కెదురుపోవుట నెవరికి సాధ్య మగును? సనాతనుల కిష్టము కాకున్న వారి భావములు వారి యందు లీనమగుకాలము ప్రాప్తించె. అని యాలోచించు చుండ నిదురపట్టె.

# స్వయంవరము

పూర్ణచంద్ర మహీకాంతుఁడు కమలావతీ వృత్తాంతము తత్సఖీముఖమున నెఱింగి తదభీష్టసిద్ధికై కన్యాస్వయంవరము వెళ్ళడించుట యుక్తమని తలంచి ఎల్ల దేశముల వెళ్ళడించె. స్వయంవరకాల సమాగత రాజకుమార వర్గము, సామంత రాజలోక బంధుమిత్రాదులు విడియుటకై తత్తదుచిత భవనముల శుభ్రపఱచి సిద్ధపఱుపను, స్వయంవర సభ నలంకరింపఁజేయుట లోనగు కార్యములఁ జేయింపను మంత్రి సత్తము నియోగించె. ఆ సచివాగ్రణి ప్రభుకార్య నిర్వాహ కుతూహలాయత్త చిత్తుఁడై వలయు వస్తువుల సమకూర్చి సేవకుల కాజ్ఞాపించె. శిల్పులు, చిత్రకారులు, వారి వారి కృత్యముల స్తుతిపాత్రములుగా నొనర్చిరి. స్వయంవర దివస మాసన్నమగుకొలఁది పౌరులెల్లరు తమ భవనముల నలంకరించుచుండిరి. స్వయంవరార్థ మరుదెంచిన రాకుమారుల క్షేమ మారయుటకునై నియుక్తులగు నుద్యోగులు రాజపుత్రులకు వలయుసౌకర్యములు గావించుచుండిరి. మఱుసటిదినము స్వయంవర మహోత్సవ దివసమగుటఁ బురమెల్ల నుత్సాహ పూరితమై యొప్పె.

ఆనాఁడు స్వయంవర దివసమగుటచే సఖీజనము కమలావతికి జలకమార్చి సర్వాభరణ భూషితగా నొనర్చిరి. స్వయం

వర ముహూర్త మాసన్నమగుటయు పూర్ణచంద్ర భూజాని పురోహితా ద్యాప్తవర్గమ్ముతో సభాస్థలికేగి లోనికి వార్త నంపె.

ఆ యా దేశపు రాజపుత్రులెల్లరు వేత్రాసనముల నధివసించిరి. అందు మణిపురాధీశు నను(గు పుత్రు(డు మోహానాంగు(డు హార మధ్యగత రత్నముపోలె విరాజిల్లుచుండె. తిర్గి స్వయంవర ముహూర్త కాలము సమీపించెనని యంతిపురమునకు వార్తలంప కమలావతి త్రిభువన మాతయగు పార్వతికిని నిజజననియగు కాంచనమాలకును సాష్టాంగదండ ప్రణామ మాచరించి యాశీస్సులంది సఖీజనము చెంతనుండి మార్గము చూప హంస యానంబున స్వయంవర మంటప మలంకరించె.

అచటి రాకుమారులెల్లరు కమలావతీ రూప మరందమును నేత్ర పాత్రంబుల(గ్రోలి "ఆహా! ఈ యువతి త్రిభువన విజేతయగు మదనుని పంచమేతర సాయకమా? మారవిరోధియగు నీశ్వరునిపై తమ మోహవారాశిముంచిన మోహినియా? ఈ యువతీమణి నన్నువరించునా ? లేక మదన్యు వేఱొండు రాకుమారుని వరించునా? అని విభ్రమము చెందుచుండిరి.

కమలావతి యన్నవో సభాభవనము నలుదెసల( బరికించి చూచుచు నా రాజపుత్ర సమూహంబున నాత్మ మనః కుముద వికాసకు(డును స్వతేజోనురంజిత రాకుమార మండలుండును నగు మణిపురయువరాజగు మోహానాంగుని గాంచి చంద్రోదయావసర పారావారము పోలె నంతరంగమున

నుహ్వాంగుచు తత్సభాసీనులగు రాకుమారుల నొక్కొక్కర నతిక్రమించి మోహనాంగు సమీపించునంత నాత్మ పార్శ్వ నువర్తినియు సుమదామానురంజిత పాణినియు నగు వకుళ యొస సాభిప్రాయముగఁ దిలకించె. తదాశయమును గుర్తించి వకుళ కుసుమ మాలిక నందియ్య గమలావతి ప్రకంపమాన పాణిపల్లవయుఁ బ్రస్వేద గాత్రయునై యాపూల సరముచే మోహనాంగు కంఠదేశ మలంకరించె. తోడన తక్కిన రాకు మారులెల్ల రాజానుమతంబునఁ దమ తమ వాసభవనముల కేగిరి. మోహనాంగ కమలావతులు పురోహిత వర్గంబునకును మహీవల్లభుండగు పూర్ణచంద్రునకును అభివందన మాచరించి వారి యాశీస్సులఁ బడసిరి. అనతికాలమున ఆపూర్ణచంద్ర మహీపతి మోహనాంగ కమలావతులకు శాస్త్రోక్త విధాన మునఁ బాణిగ్రహణ మహోత్సవ మాచరించె. నాటినుండి యుఁ గమలావతీ మోహనాంగులు పరస్పరాను రాగపూరి తులై మెలంగుచుండిరి. ఆకాలముననే సుదర్శనభట్టు తన కూతుఁ బద్మావతిని మణిపురాధీశు నాస్థాన పండితుఁడగు హిరణ్యగర్భుని పుత్రుఁడగు కమలమిత్రుని కిచ్చి దేవ భూదేవులు కొనియాడ పాణిగ్రహణ మొనర్చె.

## పదునాల్గవ ప్రకరణము

### మణిపురపు ముట్టడి

కౌటిల్య నగరాధీశుఁడగు చంద్రశేఖరుఁడు కుటిలవర్తనుఁడు పరభాగ్యాసహిష్ణుఁడునగుటచే మున్నొకతఱి మణిపురిపై దాడివెడలి నాటి సంగ్రామమున బరాజితుఁడై ధర్మవర్ధనుని కారుణ్యమునఁ బునస్సమాసాదిత రాజ్యవిభవుఁడై మెలఁగుచు నాటినుండియు ధర్మవర్ధను జయించి యాతని రాజ్యమపహరింప యత్నించుచుండె. ఈ మానవేంద్రునకు దూరదర్శియగు నాంతరంగిక మిత్రుఁడు కలఁడు. వీరిద్వర నొక నాటి నిశీథమున నిష్టగోష్ఠి యొనర్చుచుండఁ జంద్రశేఖరుఁడు "మిత్రమా! ధర్మవర్ధనుఁడు మనకు సహజవిరోధి. మున్ను వీనిని సంహరించి వానిరాజ్య మాక్రమింప యత్నించితి గాని, దైవప్రాతికూల్యమున యత్నము విఫలమయ్యె. నాటినుండియు వాని యౌన్నత్యమును సహింపనివాఁడనై వాని శత్రు రాజులతో మైత్రిచేసి మనకుఁ దోడ్పడగ నర్థించిన వారు తోడ్పడుదుమని వాగ్దాన మొనర్చిరి. మనము రహస్యలేఖల నంపిన వారెల్ల ధర్మవర్ధను నెడ తమకుగల విరోధమున మనపక్షమునఁ జేరి పగదీర్చుకొందురు. మున్ముందు మనసేనలతోన మణిపురము ముట్టడింతము. ఇంతకాల మోపులనో సహించితి. నీ సహాయమును నమ్మియే యీ ఘనకార్యమునకు సన్నద్ధుఁడనైతి. నీ భారము. నీవీకార్యము నప్రమత్తుఁడవై సహప్రాప్తులఁ బరిశీలింపనగు" అని పలికెను. అంతఁ గపటవిద్యాపారంగతుఁడు

మహామాయావియునగు దూరదర్శి "ఓయీ! ఈయల్పకార్య
మునకై యింత వగవనేల? మణిపురాధీశుని రూపుమాపు
టయు నాతని రాజ్యరమ నాక్రమించుటయు నొక ఘనకార్య
ముగ నెంచితివా? సందియపడక శీఘ్రము సేనానాయకుల రా
వించియాజ్ఞాపింపుము. రాజపుత్రుఁడు దేశమున నుండియుఁ
బురమున లేని యీ తరుణమునసే మనమాతని నోడింపఁ
దగునని బోధించె.

అమృత తుల్యములగు మిత్రుని పలుకుల కలరిన చంద్ర
శేఖరుఁడు తన సేనాధిపతుల రావించి "మీరలు రయంబున
సేనల నాయత్తపఱుపుఁడు. మణిపురము ముట్టడింపవలయు.
రేపు ప్రయాణోచిత దివసముగఁ బెద్దలునిశ్చయించిరి. ఇందు
మనకు విజయము నిశ్చయము. శీఘ్రముగ సేనల సిద్ధపఱు
పుఁడు. పొండని శాసించె.

మహీధవు పల్కు లాకర్ణించి వాహినీపతులు "ఓహో!
ఈ దుర్మార్గున కాధర్మమూర్తి యొనర్చిన యపకృతియేమి?
పొట్టకూటికై యీనీచు నాశ్రయించుట చేతనేకదా మన
మును నిట్టి పాతకంబులఁ బాల్గొను దురవస్థ ప్రాప్తించె" అని
మనమునఁ దలపోసియు నాతని వీడిపోవు మార్గము గానని
వారలగుటచే రాజాజ్ఞగొని వెడలి యుద్ధ సన్నద్ధులైరి. ఇట్లు
సేనానాయకుల నాజ్ఞాపించి తన యంతఃపురమున కేగి బుద్ధి
మతి యను తన యర్ధాంగితోఁ దన మణిపుర యుద్ధవార్త
యెఱిఁగించె. అంత నా సాధ్వీలలామ "నాథా! తామనన్య
సామాన్యంబగు భుజబలమున ననేకుల రాజులఁ జయించి

యందు గొన్ని రాజ్యముల స్వాధీనము చేసికొనియు మఱి కొన్నిటఁ బితృశూన్యుల బాలురయెడ కరుణించి వారిని నిల్పినవారివలనఁ గప్పము గ్రహించియుఁ దమ కీర్తి వల్లికల నలుదెసలఁ వ్యాపింపజేసిరి. కావున నీరాజ్య విభవములతోఁ దనివిఁ పొంది యుద్ధయత్నము విడుచుట యుత్తమ పక్షముగ నా బుద్ధికిఁ దోచుచున్నది. పిమ్మట దేవర చిత్తము. అని పల్కె.

బుద్ధిమతి పల్కులాలించిన చంద్రశేఖరుఁడు "ఇంతీ! నీ విట్లు పలికెదవేల? మనము జయముగొనుటఁలో సంశయించు చుంటివా? మనము యుద్ధమున నిలువ శత్రువుఁ వెన్నోడ్డి పాఱక రణరంగమున నిల్చునా? కాక నామిత్రుఁడు దూరదర్శి మాయావాగురమునఁ జిక్కనివారు లోకమున నుందురా? సంశయింపకుము. పోయి వచ్చెద. అని తన యర్ధాంగి నూరడించి మఱునాఁటి యుదయమున మిత్రుఁడగు దూరదర్శిని రావించి "మిత్రమా! నీవు పురమందుండి యుపాయముల నాలోచింపుచు మనపురము శత్రు సమాక్రాంతము కాకుండఁ జూచుచుండుమని" పల్కి మిత్రప్రోత్సాహితుఁడై పరిమిత సమేతముగ మణిపురమున కేగి పురప్రాంతమున విడిసి రణభేరి మ్రోగించె.

## పదునైదవ ప్రకరణము

### యువరాజు రాక

కౌటిల్య నగరాధీశుఁడగు చంద్రశేఖరుఁడు పురము నలుదెస సేనలతో విడిసియుండె. భేరుల మ్రోత మిన్నుముట్టుచుండె. ఆ స్వయంవరమున కేగిన మోహనాంగు శ్వశుర నిర్బంధితుఁడై యచట వసించుచుండె. ఇట్టితఱి బాహుబల సేనాబలము కలవాఁడయ్యు ధర్మవర్ధనుఁడు సంశయాకులిత మనస్కుఁడై రణభేరి మ్రోగింపక మంత్రిసత్తముని భావి కర్తవ్యతను గూర్చి యాలోచింపుమన సచివశ్రేష్ఠుఁడగు సుబుద్ధి తానును గొంతతడ వాలోచనా నిమగ్నుఁడై రాజు నుద్దేశించి "శూరాగ్రేసరా! తాము వీరాధివీరుల ననేకుల రణరంగమున రూపుమాపుట మఱచితిరా? దుర్బలుఁడు యుద్ధమున వెనుదీయునుగాని తమ్ముఁబోలు శౌర్యధురంధురులకీ నీచాతినీచుండును బరబలాధారుఁడును దమ వార్తా శ్రవణ మాత్ర ప్రకంపిత గాత్రుఁడు నగు నీ చంద్రశేఖరునితోడి సమరమునకు వెనుదీయ నేల? కాన నెంటనే రణభేరుల మ్రోయింపుఁడు. మోహనాంగునికై లేఖయొసగి వార్తాహరు నంపెద. ఆతడును శీఘ్రము సేనా సమేతముగ నేగుదెంచునని ప్రబోధింప రాజ మార్తాండుఁడగు ధర్మవర్ధనుఁడు మంత్రి బుద్ధిబలము ప్రధానముగఁ జేసికొని రణభేరి మ్రోగింప నాజ్ఞ చేసె. రాజాజ్ఞ భేరి మ్రోగింపబడె. పిదప సుబుద్ధి యొకభటుని

మూలమున నీవార్త మోహనాంగునకుఁ దెలియనంపె. ఉభయబలములు ఘోరాతిఘోరముగఁ బోరుచుండె. పలువురు వీరులు రణనిహతులై వీరస్వర్గ మలంకరించుచుండిరి. పరబల వాహిని "ప్రతి పత్త్యాధశీలస్య విద్యేవతనుతాం గతా" పాఠ్యమినాఁడు విద్య నభ్యసించువాని విద్యపలె శత్రుసేన నానాఁటికి క్షీణత్వ మొందుచుండెను.

సుబుద్ధునిచే నంపఁబడిన భటుఁ డశ్వాధిరూఢుఁడై త్వరితగతిని గాంచన నగరముపొచ్చి తన రాకను భటునిమూలమున మోహనాంగున కెఱుకపఱచె. యువరాజానుమతుఁడై సేవకుఁడు లోనికరిగి మోహనాంగునకు వందన మాచరించి మన నగరము శత్రు పరివృతమై రణరంగ మయ్యెనని యెఱిగించె. మోహనాంగుఁడు కొండొకతఱి యాలోచనా నిమగ్నుఁడై మనసు దిట్టపఱచుకొని మఱసటి దినమునఁ దా మణిపురము చేరునటుల దెలియఁబలికి యాసేవకు నన్నపానాదులఁ దనియఁబఱచి పురికంపె. పిదప నేకాంత మందిరము పొచ్చి కౌటిల్య నగరాధీశుఁడు తనపురము ముట్టడించుటకుఁ గల కారణములను దానాచరింపవలయు యత్నమును నాలోచించి "దుర్ణయుండును గార్యాకార్యానభిజ్ఞుఁడు నగు చంద్రశేఖరుఁడు మనపై నెదుర్చుటన్న కాలాగ్నిపై శలభవిలంఘనము కాదే? వాని సైన్యసంపదయన నెంత. నా బాహుబల బుద్ధిబలములచే వానిసైనికులనెల్ల సమరతలమున నిహతులఁ జేసి శమనగృహాతిథులఁ గావింపకుందునే" అని తలఁచి కమలావతీమందిరమున కేగి "ప్రేయసీ! కౌటిల్య నగరాధినాథుఁడు

నా పరోక్షమున మణిపురము ముట్టడించె. భటునిమూలమున నేఁడీవార్త నెఱింగితి. నేనేఁగి శత్రుసంహార మొనర్చి నిర్వక్ర పరాక్రమంబునఁ బ్రజాపాలన మాచరించు మాతండ్రిగారికి దక్షిణబాహువ నయ్యెద" నని పలుకుసంతఁ గమలావతి ప్రత్యుత్పన్న కోపావిష్టయై "మన నగరమును శత్రులు ముట్టడించుటయా? నా యస్త్రవిద్యా ప్రదర్శనమునకు నేడు కాలము ప్రాప్తించె. నాఁడు నరకాసుర సంహారమున శ్రీ కృష్ణభగవానునితో నేఁగిన సత్యాదేవి తన యస్త్రప్రయోగ నైపుణ్యమును జూపి శత్రుసంహార మొనర్చిన కైవడి నేనును దమ్మునుగమించి శత్రులఁ దునుమాడెద" నన మోహనాంగుఁడు "ముగ్ధా" నీవ సమర్థమ కానోపుదు వైన నియ్యది నీ ప్రయాణమున కనుచితము, శత్రులఁ బరిమార్చినంతనే యీ వార్త నీ కెఱిఁగించి నిన్ను మణిపురమునకుఁగొనిరాఁ దగువారల నంపెద. ఆలసింపరాదు" అని యాపె నెట్టెటో యొడ బఱచి శ్వశురునంతికమున కేఁగి మణిపురముపైఁ జంద్రశేఖరుఁడు దాడివచ్చు వృత్తాంత మెఱిఁగించి పూర్ణచంద్రు నాదేశమ్మున సముచిత సేనా సమన్వితుఁడై మణిపురముచేరి మఱునాటి యుద్ధమునఁ దాఁబాల్గొని నాఁడు రణరంగము పీనుగుల పెంటగాఁ జేసె.

## పదునాఱవ ప్రకరణము

### కుతంత్రము

ప్రమదావనమున కమలావతిచే నవమానితుఁడై పురముచేరి నాటినుండియు నాపైపై పగనూని "ఈదుర్మార్గురాలి నెన్నటికైన నేయుపాయముచేనైన నాదాసిఁ గావించుకొనకుందునా? నన్నుపరాభవించుటా? ఓమనమా శాంతిల్లుము. నేడు కాకున్న నెన్నటికైన నీకాంత నాయధీన కాకమానదు" ఈ కార్యాన నెట్టి యెట్టి విపత్తులొదవిన నొదవుగాక. ప్రాణములు పోయినఁ బోవుగాక. ఈనేను బట్టిన పట్టు విడుచువాఁడను కాను" అని తలపోసి యట్టిసమయమునకై ప్రతీక్షించుచుండె. కాలక్రమమున కమలావతి మణిపుర యువరాజగు మోహనాంగు బాణిగ్రహణ మొనర్చె ననెడివార్త తన క్రోధాగ్ని కాజ్యధారయై ప్రజ్వలింపఁజేసె. తోడన సతీపతుల వేఱుపఱచు భావముత్పన్నమై తన్నుఁ బ్రోత్సహింపఁ గౌటిల్య నగరాధి నాయకుఁడగు చంద్రశేఖరుఁడు మణిపురముపై దాడి వెడలెననెడివార్త శ్రుతిపథమునలంకరింప నా మణిపురపుముట్టడి తన కార్యసాధనోపాయముగ మదినెంచి తత్కార్యాచరణ నిశ్చిత స్వాంతుఁడై చంద్రశేఖరు నాంతరంగిక మిత్త్రుఁడగు దూరదర్శి నుద్దేశించి "మిత్రమా! చంద్రశేఖర సార్వభౌముఁడు ధర్మవర్ధనుని సామ్రాజ్యము కైవసముగావించుకొన నెంచి మణిపురము ముట్టడించినటుల వినియుంటిని. మణిపురాధిపతి నాకు శత్రుకోటిలోని వాఁడగుటచే వాని

శత్రువులగు మనమిద్దరము మిత్రులమైతిమి. ఈ తరుణమునే మీకు సహాయుడనై వాని వధించి నా క్రోధాగ్ని నుపశమింపఁ జేసికొందును. మిమ్ముఁగూడి చేయఁ దగిన కృత్యము లనేకములు. నా ప్రార్థనమును సఫలము గావింతురని నమ్మితి. ఇట్లు మీ యాంతరంగిక మిత్రుఁడు దుష్టబుద్ధి మహీనేత'' అని యొక లేఖ వ్రాసి ముద్రవైచి యొక భటునిచేఁ గౌటిల్య నగరమున కంపె. భటుఁ డా లేఖగొని కౌటిల్యనగరమున కేగి చంద్రశేఖరుని మిత్రుఁడును గార్యదర్శియునగు దూరదర్శిని దర్శించి తన యేలికయిచ్చిన లేఖనొసగ దూరదర్శి యా లేఖ నామూలాగ్రము చదివికొని సంతసించి '' తోడనవచ్చి తన్ను దర్శింపుమనియు వచనీయము సర్వమా తరుణమున నివేదింతునని తన యంగీకారసూచకమగు నొక జాబు వ్రాసి వచ్చిన భటున కిచ్చిపంపె. ఆసేవకుఁడా లేఖగొని తన ప్రభువగు దుష్టబుద్ధి మహీపాలునకీయ నాతఁడా లేఖ యందలి యంశములఁ జదివికొని సంతుష్టాంత రంగుఁడై నాడ వేగజితకురంగమగు తురంగము నధిరోహించి కౌటిల్యనగరమున కేగె. దూరదర్శి, దుష్టబుద్ధి ధరాకాంతురాక భటునివలన విని యెదురేఁగికొనివచ్చి యుచితాసనాసీనుగావించి శైత్యోపచారముల మార్గాయాస మపనయించి వాని యేకాంత గృహమునకుఁ గొనిపోయి వచనీయము సర్వము నివేదించి వాని తన యాంతరంగిక మిత్రుని గావించుకొని నాటినుండి యుఁ దాఁజేయు రాజకార్యముల వాని యంగీకారము నొందుచుండె.

# కపటలేఖ

మోహనాంగుఁడు యుద్ధమునఁ బాల్గొనినదాదిగఁ గౌటిల్యనగరాధీశు సైనిక నికాయము నానాట క్షీణదశ నొందుచుండె. చంద్రశేఖర సార్వభౌముఁడీయుదంతము తనయాంతరంగికమిత్రుఁడు కార్యదర్శియునగు దూరదర్శికి చారుముఖమునఁ దెలియఁజేయఁ దోడన 4000 కాల్బలము మణిపురమునకనిపి యీ వృత్తాంతము తన నూతనమిత్రుడగు దుష్టబుద్ధిధరానేత కెఱిగింప నాతఁడు "కమలావతి యెడఁ దనకుగల విరోధము దీర్చుకొనుట కది తగిన యదనని తలఁచి" దూరదర్శి నుద్దేశించి "మిత్రమా! మనమీపట్టున మనసార్వభౌమునకు జయము సమకూర్చుటకుఁ జక్కని వెరవు పరికించితి. దానఁ దప్పక కార్యసిద్ధియగు. మున్ముందు మనము మణిపురయువరాజగు మోహనాంగు లేఖగా నొక లేఖ వ్రాసి యాతని భార్యకంపినచో నామె యాలేఖ ప్రాణవిభుని లేఖగ నెంచి సేవకునితో భర్తృ సమీపమున కేగఁ బయనమగు. ఆమెను మనము చెఱనుంచిన మణిపురయువరాజు చిత్తవిభ్రమము నొంది పోర నేరక మన సైనికులచేఁ జిక్కును దాన మనకు విజయము నిశ్చయ"మని విన్నవింపగ దూరదర్శి "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునట్లు తనకు నాయాలోచన ముత్తమమని తోచ దుష్టబుద్ధిమహీపాలుని సంస్తుతించి తదుపదేశానుగుణ లేఖ కమలావతికి నంప నెంచి బహిఃప్రాణ తుల్యుడగు

భటునొకని రావించి "ఓయీ! మనప్రభువగు చంద్రశేఖరునకు గొప్ప యాపద రానున్నది. ఇట్టితఱి మన ముపేక్షించిన మనయత్నము లవణాంబుధి శర్కరాపాత తుల్యమగు. వేఱ వచింపనేల? మనమందఱము కలసిమెలసి యీ ప్రదేశమున నుండుటయే దుర్లభము. మనమందఱము మణిపురాధీశుఁడగు ధర్మవర్ధనుని సేవకులమగు సమయము రానున్నది. కావున నీవు శీఘ్రముగ గాంచన నగరమున కేగి నేనిచ్చు లేఖను కమలావతి కందఁజేయుము. ఆమెను నీతోఁగొని రమ్ము. మార్గమధ్యమున వలయు పరివారమును సిద్ధముగ నుంచెద. అంత నాయువతిని మనపట్టణమును జేర్చి చెఱనుంపుఁడు. దాన మనకార్యము సఫలంబగు" అనిపలుక అంతనా భటుఁడు "ప్రభువర్యా, మన యేలిక కార్యమునకు వెనుదీయుదునా? గృహమున కేగి వచ్చెద. లేఖ సిద్ధమొనర్పుమని" వెడలునంత దూరదర్శి యీ క్రిందివిధమున లేఖవ్రాసె.

"ఓ ప్రేయసీ! నా మనస్సరోవర మరాళమా, పూర్ణచంద్రుఁడు కుముదినీ సంబంధము వీడనేరకున్నను సంభవించిన ప్రతికూల కారణములచే వీడియుండె. అనతికాలముననే కుముదిని వికాసమొందు సమయము తటస్థించును. క్షపానాధుఁడు తనకుఁగల రాజనామ మన్వర్థంబు గావించుకొని పరబలముఖపద్మము ముకుళింపజేసి వాసి గాంచుచుండె. నేటితోఁ బరబల జలజాకరములు పంకమాత్రావశిష్టములయ్యె. కాన నీ మనోవికాసకారణుండగు రాజశేఖరుఁడు ప్రాణతుల్యుఁడగు భృత్యుని మూలమున నంపు వృత్తాంతము నెఱింగి తోడన

యరుదెమ్ము. కుముదినీ కుపానాథుల సమావేశమగుడు నెల్ల వార్తలు తెలియనగు.

ఇట్లు నీమనోహరుఁడు,
రాజశేఖరుఁడు. "

అని వ్రాసిన లేఖ భటునిచే నంపి మార్గమధ్యమున నాపెను బంధించుటకై భటులఁ గొందఱ నియమించెను. కమలావతి లేఖను గొనిపోయినభటుఁ డేకాదశ ఘటికా పరిమిత కాలము నకుఁ గాంచననగరమున కేగి తద్వృత్తాంతము సఖీ ముఖ మునఁ గమలావతి కెఱిగింప నా సఖీముఖముననే యా లేఖ నందికొని పరిసరవర్తులు సనుంగు సఖురాండ్రు వకుళ మున్నగు వారలకు మోహనాంగుని విజయవార్త నెఱిగించి తోడన మాతృమందిరమున కేగి మాతృపాదాభివందన మాచరించి తమ యల్లుని విజయవార్తను విన్నవించె. ఆయమ యల్లుని విజయవార్త కమితానందము నొందెను. ఈ వార్త తండ్రి యగు ధర్మవర్ధనున కెఱుకపఱపనెంచి వకుళచే నాలేఖ నంపె. ఆతఁ డా లేఖను జదివికొని యానందించి సంతసము పుత్రికకు నెఱ్ఱడింపఁ బాటచారిణియై కూఁతుచెంతకు వచ్చి ముచ్చటించి తన భవనమున కేగె. భర్తృప్రేషితపత్రికావలోకనోత్తరక్ష ణమునుండియు మణిపురప్రయాణ కుతూహలోపేతాంతరంగ యయ్యు "ప్రాణనాథుఁడు పురమునకు వెడలుతఱి వచించిన వాక్యలకును బత్రికలోని మాటలకును భేదము చూపట్టుటచే నీ వృత్తాంతము శత్రుకాపట్యముగ నూహించి తన ప్రియ సఖియగు వకుళ నాహ్వానించి "సఖీమతల్లీ! నేటి వృత్తాంత

మంతయు శత్రు కాపట్యముగ గోచరించుచున్నది. రాజేంద్రుఁడు పురమున కేగుతఱి దుపటిః దగు పరివారము నంపెదనని పల్కె. లేఖయందన్నవో యీ భటునితో రమ్ము". అని లిఖింపఁబడియెడిని. కావున నీ లేఖవిషయమున సందియపడు చున్నాను: నాకుబదులు నీవే యీ భటునితో నేగి, మాన ప్రాణరక్షణము సేసికొనుచు నీ కపటనాటకమునఁ గమలావతీ పాత్రనుఁ జక్కఁగ నటింపుము. నేనుగూడ మిమ్ము ననుసరించి వారి యాశయముల నెఱింగి యందుల కర్హమగు ప్రతీకార మొనర్చి నీ బంధమోచన మొనర్తును. నీవీ పాత్రము నెట్టుల నభినయించెదవో గనియెద కాక" అని బోధించి యామె నొడఁబఱచి తత్పాత్రోచిత చిత్రాంబరాలంకార భూషితగా నొనర్చి యశ్వశకటాధిరూఢగావించి భటుని సాహాయ్యమున నంపె.

అంతటితో విరమింపక సమగ్రముగ నన్వేషించి కల రూపెఱుంగ దృఢవ్రత కావునఁ దానొక సామాన్య మానవుని కైవడి గుప్తవేషమున నుత్తమాశ్వము నధిరోహించి రథమునకు దవ్వులనే యేగుచు క్రమముగఁ జంద్రశేఖరుని సైనికులు కుహనా కమలావతిని నిగళబద్ధగావించుటయో నగు విషయమును దెలిసికొని యయ్యాది తనచే నవమానితుఁడగు దుష్టబుద్ధి మహీపాలుని దుశ్చేష్టితముగా నెఱింగి యా కుటిలాత్ముని కాపట్యమునకుఁ బ్రతీకారము గావింప నెద నూహించి పురప్రవేశ మొనర్చె.

నిగళబంధిత యగు నకుళ "నా సఖురాలియ్యాది శత్రుకాపట్యమని చక్కఁగ యోచించెనే? రాకుమారి ఇంతకుపూర్వమే

యీ యుదంతము గ్రహించి తగు నుపాయము చింతించి యుండనోపు. నే నీ కపటనాటకమున నా బుద్ధిని వినియోగించి 'కమలావతీపాత్రను సర్వజనవిశ్వాసార్హము గావింతు'' నని తలంచె. దూరదర్శి యాజ్ఞానువర్తులై భటులు కమలావతిని చెఱనుంచిరి. ఆమెకు వలయు నుపచారము లొనర్ప పరిచారికల నియమించి యన్నపానీయాదికము లొసగ నాజ్ఞాపించె. పరిచారికాజనము సకాలమున నాయా యుపచారము లాచరించుచున్న నామె వాని కంగీకరింపక నిరాహారయు దీనవదనయునై నానాటికి క్షీణించుచుండె. పరిచారకా జనము దూరదర్శి కీవృత్తాంత మెఱిగింప రాకుమారి ననునయవాక్యముల నలరించి యన్నపానీయాదికమీయ నాజ్ఞచేసి వారినంపి "ఈ యబల తనకు సంభవించిన విపత్తును మదినెంచి యన్నపానీయము లంగీకరింపక దేహత్యాగమునకుఁ బాటుపడుచున్నది. మన కార్యసాధనమునకై యీ బాలను జెఱనుంచితిమి కాని యామె యిందాచరించిన దోషమేమి'' అని యోచించియు తోడన బుద్ధి మరల్చుకొని యీ బాల దోషమొనర్ప కున్నను మోహనాంగుఁడు మనకుఁ బ్రబల విరోధియగుటచే నాతని యర్ధాంగియగు నీమెయు విరోధినియ కావున మన మాచరించిన దాన నెట్టి దోషము లే''దని భావించె.

# పదునెనిమిదవ ప్రకరణము

## ఆమోదము

"మిత్రమా, మన యత్నము సఫలమయ్యె. కమలావతి మన మాయా వాగురముం జిక్కి కారాగార నివిష్టయయ్యె. కమలావతిని బంధించితిమన మోహనాంగుఁడు మన వశుఁడై బంధింతుఁడగుట కాదె. కమలావతీ వృత్తాంతము నెఱింగినచో మోహనాంగుఁడు వికలచిత్తుఁడు కాకుండునే! మనమిక మణి పురమును ముట్టడించుట సులభము. మనము సంతసించు కాలము ప్రాప్తించె. భగవానుఁడు మన కనుకూలుఁడయ్యె. అని పలుకునంత దూరదర్శి "మిత్రమా! నీధీశక్తి, శ్లాఘ్యం. నీవు తలచిన దేకార్యమైనను తప్పక ఫలించునని నా నిశ్చయము. మన తోడ్పాటునకు చంద్రశేఖర సార్వభౌముడు సంతసించునని పలుకునంత నా కుటిలాత్ముఁడు తాను నుద్యాన వనమునఁ గమలావతిని జూచినదాదిగ నంతపర్యంతము నడచిన కార్యము లన్నింటిని దలపోసి "ఇక రాకుమారిక నా యధీనకాక తప్పదు. చంద్రశేఖరుఁడు నాయుపకృతికి ప్రత్యుపకృతి గావించును. అట్టిచో నా యభిమతము నెఱిగింపఁ గోరుదు. ఆనాఁడీ కమలావతియెడ నాకు జనించిన విరోధ కారణమును నా ప్రతిజ్ఞను నెఱిగింతు. ఆతఁడు నా యత్నమునకు సంతసించి కమలావతిని గారాగార విముక్తి చేసి నా కర్పించు. నాటినుండియు నాపె నా దాసి యగు.

అంతనే సఫల ప్రయత్నుఁడ నగుదు'' అని తలంచి దూర దర్శియుఁ దాను ముచ్చటించిరి. దుష్టబుద్ధి తన యభీప్సిత సిద్ధికై దినముల నెన్నుచుండె.

# పదితొమ్మిదవ ప్రకరణము

## ప్రతీకారము

“అథవా భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర” శాకుంతల నాటకము సంభవించెడి శుభాశుభముల కన్నియెడల మార్గము చూపట్టును. దుష్టబుద్ధి యే మార్గము నాధారముగఁ గొని కమలావతిని దన భార్యగ కాకున్న చరణదాసిగనైన గ్రహింప నిశ్చయించెనో మన కథానాయిక కమలావతియు నా మార్గము నవలంబించి యే యా కునృపతిని వధించి నిస్తీర్ణ ప్రతిజ్ఞయాయెను. దుష్టబుద్ధి తన్ను చెరనుంపనెంచి కౌటిల్య నగరాధీశు ననుంగు మిత్రుఁడు కార్యదర్శియగు దూరదర్శి మూలమున దానంపిన లేఖను కమలావతి సమగ్రముగ జదివికొని యందలి వ్యాసములచే నది శత్రుకాపట్యముగా నెంచి వకుళను భటునితో నంపె. పిదప నామె యందలి సత్యాసత్యముల నెఱింగి పురికేగి తన ప్రతిజ్ఞా నిర్వహణమున కనువగు మార్గాన్వేషణమునకై దూరదర్శి నుద్దేశించి “చంద్రపాల నృపవరేణ్యు నాంతరంగ మిత్రులగు దూరదర్శి మహాశయులకు సూర్యప్రతాప ధరానేత భక్తి పూర్వకముగ నంపు లేఖ. “మహాశయా, చంద్రశేఖర ధరాకాంతునకు మణిపురాధినాధునకుఁ సమరము జరుగుచున్న వార్త విని యున్నాను. యుద్ధకాలమున సైనిక నికాయ మధికముంట విజయ సూచికము. నాకు మణిపురా

ధీశుఁడు ప్రబల విరోధి. కాని వాని నెదిరింపఁ దగు కాలము లభింపమి నట్టి కాలమునకై ప్రతీక్షింపుచుంటి'' ఏ యుపాయమున శత్రునిర్మూలనము రాజ ధర్మము. ఆతనియెడల నాకు గల విరోధమును వెల్లడించి వాని రూపుమాపుటకు మీ సహాయ మపేక్షించు చున్నాడ. నేఁ జెప్పినది చేయునది యొకటిగా యుండునుగాని భిన్నము కాదు. నేఁ బూనిన కార్యము నిర్వహించు దీక్షకలవాఁడను. నా ప్రార్థన మంగీకరించినచో నేనట్టి కార్యదీక్షకలవాఁడనో కానో మీకే తెలియును. నా వాక్యములు సామాన్యములుగా భావింపక నా కోర్కె సఫలము గావింపుఁడు.'' అని భటునిచే లేఖ నంపె. ఆతఁడు కౌటిల్య నగరము కేగి యా లేఖ దూరదర్శి నృపాలునకీయ నాతఁడా లేఖ సమగ్రముగఁ జదివి ''ఈ రాకుమారుఁడు మేధాసంపత్తి కలవాఁడగుట వాని పత్రికాంశములు స్పష్టము గావించు చున్నవి. యుద్ధసమయమున సేన లెన్నియున్నను జాలకుండును. ఇంతియకాక దేహబల బుద్ధిబలములలో బుద్ధిబల మగ్రస్థానమును వహించుచున్నది. కావున నీ రాకుమారిని మనవానిగ నంగీకరించుట ప్రధానము.'' అని యోచించి తన యంగీకారము నెఱిగించు లేఖ వానిభటునకిచ్చి యంపె. భటుఁడా లేఖను తనకీయఁ గమలావతి ''ఇది మన యత్నసౌధమునకు ప్రథమ సోపానము. ఇది ఫలవంతమయ్యె. ''ప్రథమావసదేయస్యసౌఖ్యం తస్యాఖిలే ధ్వని శివం భవతి యాత్రాయామ్'' అని ఆర్యోక్తి. ఎవని ప్రయాణమున మొదటిబసలో సుఖముకలుగునో వాని కంతట సౌఖ్యము చేకూరును.'' ఇక నా యత్నముల కెట్టి యడ్డంక

కలుగనేరదు. కార్యసాఫల్యమునకుఁ బ్రబల దృష్టాంతము. దైవసహాయముండును. ఆలసింపక కార్యసిద్ధికి యత్నించెద. కార్యమా సామాన్యమగునది కాదు. మహత్తరము. దుష్ట సంహారణము శిష్టరక్షణము. కాలవిలంబన మొనర్పరాదు. శీఘ్రము కౌటిల్యనగరమునకేగి యచ్చటివృత్తాంత మెఱింగి ప్రతిజ్ఞాపరిపూర్తి చేయవలె. అటులకాకున్న శాంతి యెట్లు? కారాగృహవాసినియగు నా ప్రియసఖి వకుళకు బంధమోచన మొనర్చుటెట్లు? నా నిమిత్తముగా నెట్టి యిక్కట్ల ననుభ వించుచున్నదో గదా? తండ్రియాజ్ఞఁగొని సేనాసమేతముగ నేగెద'' అని నిశ్చయించి తండ్రిచెంతకేగి శత్రుకాపట్యము తన ప్రథమప్రయత్నము నెఱిగించి తండ్రి యిష్టపడకున్న యుక్తియుక్త ప్రతివచనమున నా మహీనాథు నొడబఱచి సముచితసేనతోఁ బ్రచ్ఛన్నవేషమునఁ గౌటిల్యనగరముచేరె. తన శ్వశురుఁడగు ధర్మవర్ధనునిపేర నొక లేఖవ్రాయ జనకు నాజ్ఞాపించి నగరము సొచ్చి తన యనుచరుని మూలమున దూరదర్శికి తన రాక నెఱిగింప నాతఁడెదురేగ సేనాసమేత ముగ వచ్చిన సూర్యప్రతాపుని (గమలావతిని) గాంచి దూర దర్శి ''ఈతఁడు దా వ్రాసినవిధమున వర్తించువాఁడు గాని వేఱు తెఱగున వర్తించువాఁడు కాఁడు. విశ్వాసపాత్రుఁడని'' నిశ్చయించి ''ఓ రాకుమారా! ప్రయాణమూలమున బడలి నటుల మోము విన్నదనము సూచించుచున్నది. నీకై ప్రత్యేక సౌధ మేర్పఱచితి. నీ వందు వసింపుము.'' అని పలికి వాని కవసరములగు కార్యములొనర్ప సేవకుల కాజ్ఞచేసి తానప్పటి యట్లఁ దన ప్రత్యేకభవనము చేరె. సూర్యప్రతాపుఁడన్నో

విడిదిపట్టున కేగి కృతస్నానుఁడై మార్గాయాస మపనయించు కొని దూరదర్శినిసందర్శింప రాజాస్థానమందలి ప్రత్యేక భవన మున కేగి సన్మానితుఁడై భూతకాలస్థితియు, వర్తమాన వృత్తాంతము, భావికర్తవ్యాంశము, అందు దన కర్తవ్యము నుపదేశింపఁ గోరె. అంత దూరదర్శి సూర్యప్రతాపునితో నేకాంతాగారమున కేగి భూతము సాంతము నెఱిగించి వర్త మానమున మణిపురమున సమరము భయానకరూపమును దాల్చుటయు శత్రుసేనలు చంద్రశేఖరునిసేనల రూపడంచు చుండుటయు నెఱిగించి "మిత్రమా ! నీవు ధీవిశారదుఁడవు. ఆదేశించున దెద్ది కలదు ? మణిపురాధిపతిని నిర్జించి వాని రాజ్యరమ మనయధీనము గావించుకొనుటకంటె వేఱొం డెద్ది కలదు. స్వామికార్యమునెడ భక్తిశ్రద్ధలఁ జూపుము. మణి పురమునుండి సైనికదళము నంప వార్త వచ్చినచో నీవును దుష్టబుద్ధి ధరాధిపతియు సేనాసమేతులై యుద్ధరంగమున కేగ నగు." అని కర్తవ్యాంశ మాదేశించి "ఓయీ మిత్రమా ! ప్రయాణమున శ్రమపడితివి. వాససౌధమున కేగి విశ్రాంతి గొను"మని బోధించి వానినంపు సూర్యప్రతాపుఁడు దూర దర్శి వచించినట్లు కావించె.

పిమ్మట దూరదర్శి దుష్టబుద్ధినరపాలుని గొనిరా సేవకు నంపి తన వార్తానుగుణముగ వచ్చి తన్నుఁగాంచిన దుష్ట బుద్ధిని గౌరవించి నూతన రాకుమారుని ధీశక్తిని కార్య దీక్షాది సుగుణసంపత్తిని ప్రస్తుతించి సాయంసమయమగుటచే నిర్వురు వారి వారి భవనముల కేగిరి. దుష్టబుద్ధినరేంద్రు

నకు నూతన రాకుమారుఁ గాంచిపో నూహజనించి సూర్య ప్రతాపుసౌధముచేరి వానితో కొండొకవడిముచ్చటించి "మన మిర్వుర మేకకార్యనిర్వహణదీక్షఁ బూని యీ తావు చేరితిమి. మన మిర్వురము మిత్రులము పోయివచ్చెద" నని పలికి గృహమున కేగుచు నాతఁడు "మనమా? ఈ నూతన రాకుమారుని మోముచూడఁ గమలావతీ ముఖచిహ్నములు స్ఫురించుచున్నవి. మాటసవ్వడిని యోచించినను ఆ వచో నినాదమే? ఆ బాలామణియే యీ రాకుమారునికై వడి యిచటికి వచ్చెనా? లేక వేఱొక రాకుమారుఁడై యుండునా? కమలావతియే యీ రూపమున వచ్చిన వచ్చుగాక. మిత్ర సంపద్విశిష్టుఁడనగు నన్నుఁ దా నేమిచేయఁగలుగును? అటుల సందేహింపనేల? లోకమున దేహినిబోలిన దేహి యుండ కుండునా? అంతమాత్రమున నీవ్యక్తి నావ్యక్తిగా భావింప నేల? మనమూ శాంతిల్లుము." అని మనసు దిట్టపఱచుకొని గృహమున కేగె.

## ఇరువదియవ ప్రకరణము

---

## పూర్ణచంద్రుని లేఖ

కమలావతి పురము వెడలె. ఆమె పాదసంచారశూన్యమగు భవనము పద్మవిరహిత కాసారమునకైవడి కళావిహీనమయ్యె. పుత్రికావియోగమున రాజదంపతులు తమ నియత కృత్యములుకూడ మాని కమలావతిచేయు కార్యములనే తలపోయుచు నామెను సందర్శించు దినమున కెదురుచూచుచు బూర్ణచంద్ర మహీపాలుఁడు తన వియ్యంకుఁడగు ధర్మవర్ధనుని పేర "వియ్యంకులరగు ధర్మవర్ధన మహీపతులకు పూర్ణచంద్ర నరనాథుఁడు వినమ్రుఁడై సప్రణామముగా నంపికొన్న లేఖార్థములు. తాము శత్రుసంహారమొనర్చి పరరాష్ట్రము నాధీనముచేసికొని యానందాబ్ధి నోలలాడుచున్నటుల మోహనాంగ లిఖిత పత్రికాముఖమున స్పష్టమయ్యె. మఱియుఁ గమలావతినిగూడ నాభటునితోడ రా నాజ్ఞాపించుటచే నమితానందమొంది ఖడ్గమాత్ర సహాయినిగా తమ భవనమున కరుదెంచె. నాటినుండియు నేటిదనుక తమ క్షేమము తెలియమి మనసు తత్తరపడుచున్నది. శీఘ్రము క్షేమము తెలుప వేడెద" నని వ్రాసి భటునికిచ్చి మణిపురమునకంపె. రాజసేవకుఁడు మణిపురముచేరి రాజనగరు సమీపించి ద్వారపాలకుని మూలమునఁ దనరాక మానవేంద్రునకు శ్రుతపఱుప మానవేంద్రుఁడు కాంచననగర సమాగత రాజసేవకుని లోనికి రానాజ్ఞాపించె. రాజభటుఁడు ధర్మవర్ధన భూపాలునకు నమ

స్కరించి పత్రికనొసగె. ధర్మవర్ధన భూపతి యాలేఖను సమ
గ్రముగఁ జదివి చిత్రాయమాన గాత్రుఁడై "అహా! శత్రు
కాపట్యమును దినదినాభివృద్ధి యగుచున్నది. దూరదర్శి తన
మాయావాగురమునఁ జిక్కఁజేసికొని చెఱయందిడియుండు.
సమరప్రయత్నమున శత్రులచేఁ గారాగారమున నుంపఁబడిన
స్నుషకు (కోడలు) బంధమోచన యత్నమొనర్చుట సమంజ
సము" అని తలంచి యాపత్రికను మోహనాంగునకుఁ జూపె.
మోహనాంగుఁడు పత్రికను దుదివఱకుఁజదివి ప్రలయకాలాగ్ని
కైవడి మండిపడి "ఈ కుటిలాత్ములఁ-జంద్రశేఖర దూరదర్శు
లగువారి సేనలను నాప్రతాపాగ్ని కాహుతిచేసి యానాఁడు
రావణగృహవాసినియగు సీతను శ్రీరామచంద్రుఁడు పరిగ్ర
హించిన చందమున సాధ్వీమణియగు కమలావతిని జేకొని
యెద నొండె, లేక ప్రప్రథమమున శత్రునగరమును ముట్ట
డించి కమలావతిని చెఱనుండి విడిపించుట యొండె కర్తవ్య
ములు. ఆలోచించిచూడ శత్రునాశమొనర్చి తదీయ రాజ
లక్ష్మి సమేతముగా మత్ప్రాణ నాయికను గైకొనుటయే
యుత్తమ పక్షము. కమలావతి యొకతె నాగృహమువీడి
పోయినను మానప్రాణ రక్షణోపాయము నాలోచించి
యాయుధాన్వితయై యుండుగాన శత్రులు కమలావతీ మాన
ప్రాణభంగమొనర్ప నేరరు" కావున మున్ముందు శత్రునాశ
మొనర్చుటయె యుచితమనియెంచి తత్కాలోచితముగఁ
బూర్ణచంద్ర ధరణిపాలునకు సమాధానము లేఖవ్రాసి భటు

నంపి యెప్పటియట్ల నానాఁడును సమరతలమునఁ కేఁగియు చిత్త స్వాస్థ్యములేమి తనసేనల కపజయమును జంద్రశేఖరునకు విజయచిహ్నములు చూపట్టెను.

## ఇరువదియొకటవ ప్రకరణము

### మననము

వృత్తాంతము సర్వ మవగతమయ్యె. పూర్వమీ చంద్రశేఖరుఁడోడి కరుణామయుఁడగు ధర్మవర్ధన మహీపాలునిచేఁ బునః ప్రసాదిత రాజ్యవిభవుఁడై తిర్గి యుద్ధమునకై సిద్ధపడెనట. ఇంతకంటె కృతఘ్నత కలదే. ఇట్టి దుర్మార్గుఁడగుటను దుష్టబుద్ధి మైత్రికియ్యకొనియె. మణిపురమునందన్నఁ బ్రలయ కాలాగ్నిఁబడి మడిసిన ప్రాణికోటికైవడి సేన నాశమొందుచున్నదిగదా? చంద్రశేఖరుని లేఖ గాంచినంత నన్నును దురాత్ముఁడగు నా దుష్టబుద్ధినిగూడ యుద్ధరంగమున కంపెదననె. అయ్యది నా ప్రతిజ్ఞా పాలనమునకు (నత్యంతము) మిక్కిలి యనుకూలముగ నున్నది. సమరతలమున నాదురాత్మునకు దుష్టబుద్ధి నరేంద్రునకు నాతఁడొనర్చిన కుతంత్రము నందులకై నాయొనర్చిన భేదనోపాయము నెఱింగించి నాటినా ప్రతిజ్ఞను స్పష్టపఱచి వాని యమసదనమున కతిథిగావించెద. నే వాని ప్రాణాపహారియగు మృత్యుదేవతనై వెన్నంటి యుంటినిగదా? నా యుపాయ బలసౌధమీ దురాత్మునాలోచనాభేద్యము. వీనికి మరణమాసన్నమగుట చేత నేగదా దూరదర్శినాశ్రయించి యీ పన్నుగడ పన్నె. ఐన నగుగాక వీని వధించి చంద్రశేఖరుని సంహరించి ప్రాణనాథునకు నాయుధంతము స్పష్టపఱచి నా యనుగు చెలికత్తెయగు వకుళకు బంధమోచనము గావింపవలయును. ఈ కుటిలవర్తనుఁడు చెఱయందున్న వకుళను నన్నుగానెంచి తన వాంఛిత మీడే

ర్చుకొను కాలము తటస్థించుననెడి యాశతో నామెకుప
లయు నుపచారముల నాచరించుటకు సేవకురాండ్ర నియమిం
పఁజేసె. కాని నాసఖురాలగు వకుళ, ప్రజ్ఞావతి ధైర్యవతియు
నగుటచే వారి యుపచారములు తానొల్లక నిరాహారయై
దుష్టబుద్ధి దూరదర్శి నృపాలురకు విశ్వాసము కల్గించుచు నా
పాత్రమును జక్కఁగ నటించుచున్నది. పాపము ? నానిమిత్త
మా యబల యిడుమల నవయుచున్నదే? నాజీవితమునర్పించి
నను ఆమెకు ఋణవిముక్త కాను. ఆమె నాకొనర్చిన యుప
కృతులు వర్ణనాతీతములు నసంఖ్యాకములు. నాజీవితాంతము
మఱువఁజాలను. చంద్రశేఖరుని లేఖను జూచినంతన మా
యిర్వుర మణిపురమున కంపెదనని దూరదర్శి వచించెనే?
అతఁడు జాబు నెన్నఁడువ్రాయునో?, నా ప్రాణనాథుదర్శించు
భాగ్య మెన్నటికి చేకూఱునో, దూరదర్శి నన్నెంత గౌరవా
దరములతోఁ జూచుచుండిన నిది పరగృహము కాకుండునే?
నామనోవిభుఁడు నాజనకు లేఖగాంచి నావిషయమై యెట్టి
విషాదము చెందెనో ? నిక్కువముగ నేనీ చెఱనుందునని
భావించి యుండనోపు. తన్మూలమున నాతఁడెట్టి విచారసాగ
రమున మగ్నుఁడగునో? ప్రాణనాథునిగూడి చంద్రశేఖరు
రాజ్య మధీనము చేసికొనిన పిదపగదా వకుళఁ గారాగార
విముక్తనొనర్చుట. "హా" శ్రీనివాసా దయామయా, నీవిల
సనములు జ్ఞానులకుఁదక్క సామాన్య మానవులకు ప్రత్యక్ష
ములగునా? ఓదేవా, నీవెన్నడీ దీనురాలిపైఁ గరుణించెదవో?
నీవుతక్క వేఱురక్షకులెవ్వరు ? నీవ రక్షింపుమా ' అని
తలంచుచు నట్టి దినాగమనమునకై యెదురు చూచుచుండె.

## ఇరువదిరెండవ ప్రకరణము

### రణప్రయాణము

పూర్ణచంద్ర మహీపాలుని లేఖను జూచినదాదిగ మోహ నాంగుఁడు విషాదోపేతుఁడై యుద్ధమున నిరుత్సాహుఁడై యుండుటచేఁ దన సైనికులకు జయము సంభవించుచున్నటుల గ్రహించిన చంద్రశేఖర నృపాలుఁడు మిత్రుఁడగు దూర దర్శి నరేంద్రునకు "మిత్రమా! నీకు నాయెడగల వాత్సల్య మునకును మద్విజయార్థము నీవొనర్చు నుపాయ జాలంబునకు నమితానంద మొందుచున్నాను. నీవొనర్చిన నీప్రయత్నము లన్నిటఁ గమలావతిని జెఱనుంచుట యనునది మోత్తమము. మోహనాంగుఁడు నావార్త నెఱింగినవాఁడై నిరుత్సాహుఁ డై యుండుటచే మనపక్షమున విజయము వాటిల్లుచున్నది. ఈతరుణముననే యసంఖ్యాక సేనాసమేతముగ యుద్ధమొనర్చిన మనకు విజయము లభించుట కెట్టి సందియము లేదు. కావున మనపురమందున్న సేనల నీ లేఖగాంచినంత నంపనగు" నను లేఖవ్రాసి యొక భటునకిచ్చి కౌశల్య నగరమున కంప నా భటుఁడు రాజాజ్ఞానుసారము స్వపురమునకేగి దూరదర్శి నృపాలునకా లేఖనీయ దూరదర్శి యద్దాని నాద్యంతము చదివి సంతసించి తోడన సూర్యప్రతాప దుష్టబుద్ధి నృపాలుర వేర్వేఱు సమయముల రావించి వారల కెఱిగింప వర్హవిష యముల బోధించియు చంద్రశేఖర నృపాలుని పత్రికావిషయ ముల నెఱింగించి తమ తమ సేనాసమేతముగ మణిపురమున

కేగ నాజ్ఞాపించె. వారలు తమసైనికుల నానాఁడు ప్రయాణ సంసిద్ధులగుట నాజ్ఞాపించి తాముసు రణోత్సాహపూరితు లయ్యె వారిర్వురు తమతమ ప్రతిజ్ఞలు నిర్వహించు కాలము తటస్థించెనని ద్విగుణీకృతోత్సాహ పూరితులై రి. దుష్టబుద్ధి "ఈనాఁడు మణిపురాధిపతిని సంహరించి చంద్రశేఖరునకు ముదము చేకూర్చి కమలావతిని నాయర్ధాంగిగఁ బడసి నాప్ర తిన నెరవేర్తు" అని మనమునఁ దలపోసె.

సూర్యప్రతాపుఁడన్ననో (కమలావతి) "నేటితో నీదురాత్మ ర్గునకుఁ గాల సమాప్తమయ్యె. నా ప్రతిజ్ఞా పరిసమాప్త కా లము సంభవించెను. తప్పక యుద్ధరంగమున వానికి నన్నెదిం గించి ప్రాణముల నపహరించి యమసదనమున కంపెద. నా యుద్ధనైపుణ్యము నా ప్రాణనాథుప్రోల స్పష్టపఱచెద" అని యంతరంగమున నుత్సహించె.

ఇట్లు సూర్యప్రతాప దుష్టబుద్ధి ధరాపతులు తమ తమ యిచ్ఛానుసారము నాలోచించి దూరదర్శినృపాలుని ముదల గొని సేనాసమేతులై మణిపురమునకేగి చంద్రశేఖర పార్శ్వ భౌము సందర్శించిరి. ఆతఁడును వారిరాక కమితానందమంది కొంతతడవు వారితో ముచ్చటించి మఱచటిదినమున వారల సమర తలమునకేగ నాజ్ఞాపించె. ఆనాటియుద్ధమున మణిపు రాధీశు వధించి తప్పక వానిరాజ్యము గ్రహింపనగు ననెడి యుత్సాహముతన్నుఁ బ్రోత్సహింపఁ దానుసైత మానాటియుద్ధ మునఁ బాల్గొన నిశ్చయించె.

## ఇరువదిమూఁడవ ప్రకరణము

## ప్రతిజ్ఞానిర్వాహణము

చంద్రశేఖరధరానేత తన మనోవ్యాకులతను గ్రహించి నాటి సమరమునఁ దన్ను సమయింపనెంచి సేనల రప్పించెననెడి వృత్తాంతమును మోహనాంగుఁడు చారముఖమున నెఱింగి యీ వార్త మంత్రియగు సుబుద్ధికిఁ దెలియనంపి సేనలు సిద్ధమొనర్ప వేడి తానే విషయము నెఱుంగనివానికై వడి నాటి యుద్ధమున నెప్పటియట్లఁ బ్రవర్తిల్లుచుండెను. చంద్రశేఖరుఁడన్న ద్విగుణీకృతోత్సాహపూరితుఁడై సూర్యప్రతాప దుష్టబుద్ధినృపాల సేనాసమేతుఁడై సమరతలమున కేగె. ఉభయ పక్షములసేనలు సమరతలమున నిలిచి పోరుచుండెను. ఉభయ పక్షపు సైనికులు హతులగుచుండిరి. యుద్ధరంగము శవ నివహములచేఁ గప్పఁబడి యుండెను. రక్తవాహినులు ప్రవహించుచుండె. ఇంతటి బలసమన్వితమయ్యును జంద్రశేఖరుని పక్షమున విజయచిహ్నములు చూపట్టకుండె. సైనికులు పలువురు మడియుచుండిరి. క్రమముగ శత్రుసేనలచే తనపక్షపు సైనికులు హతులగుటఁ గన్నులఁ గాంచిన చంద్రశేఖరుఁడు నిరుత్సాహుఁడై భూతావిష్టుకైవడి నిల్చియుండె. ఆనాడు మోహనాంగుఁడు తన బలముచేఁ బరబలము క్షీణించుటఁ గన్నులఁ గాంచినవాఁడగుటచే నమితోత్సాహమొంది "ఈ దినమున నా విరోధియగు చంద్రశేఖరునిఁ బ్రాణములతో విడచువాఁడనే? అట్లగుచో రాజనామము తాల్పనేల ?

కాల్చనా ? వీని నెట్లైన నీదినమున విగతాసునిగా నొనర్చి
విజయలక్ష్మీ సమేతుఁడనై పురమున కేగెద.'' అని తలపో
యుచు రణవిహారమొనర్చుచుండె. సూర్యప్రతాపుఁడన్ననో
(కమలావతి) ప్రాణవిభుని గన్నులఁగాంచి యమితోత్సాహ
పూరితుఁడై తన యుత్సాహము బయల్పడనీయక ప్రాణ
నాయకునిదక్క నితరసైనికులపై బాణప్రసారముఁ జేయుచు
యుద్ధమొనర్చుచున్నటుల నటించుచుండె.

చంద్రశేఖరుఁడు కోపప్రపూర్ణుఁడై మత్తసింధూలముపై
నుఱుకు పంచాననముకైవడి మోహానాంగునిపైఁ బడి చంప
నుంకింప సూర్యప్రతాపుఁడు (కథానాయికయగు కమలావతి)
శత్రువువలనఁ జక్రవర్తి కపాయము సంభవింపకుండ రక్షిం
చుకైవడి ప్రభుని చెంత నిల్చియుండెనని తనపక్షమువారూహిం
చునటుల ఖడ్గోపేతయై నిల్చి వెన్వెంటనే చంద్రశేఖరుని
తన ఖడ్గముచే యమపురమున కతిథి గావించెను. వీరరస
పరిపూర్ణహృదయుఁడగు సూర్యప్రతాపుఁడు (కమలావతి)
యంతటితో విరమింపక దుష్టబుద్ధి నెదిర్చి "ఓరీ, పాతకుఁడా!
నిలు నిలుము. నన్నెవరిగా నెంచితివి? ఆనాఁడు ప్రమదా
వనమున నినువధింప ప్రతినంబూనిన రాజపుత్రిని కమలావతి
నిగా నెఱుంగకుంటివే? నన్ను నీ యర్ధాంగినొనర్ప నీ పన్నిన
కుటిలమార్గముల నెల్ల గ్రహించి నినువధింప నీ వెన్నంటియున్న
మృత్యుదేవతగాఁ దలంపవైతివిగదా? శత్రువింట చెఱనున్న
నాతి కమలావతి యనెడి భ్రాంతిగొని మురియుచుంటివే.''
ఇదిగో బూనిన ప్రతిన నిర్వర్తించుచుంటి నని పలికి కొంత
కాలము యుద్ధమొనర్చి దుష్టబుద్ధి శిరచ్ఛేదముచేసి కృతార్థ
యయ్యె.

చంద్రశేఖరుని మరణముగాంచినంతనే మోహనాంగుఁడు వెన్నంటి చంపునని నెడి భీతిచే వీరభటులు యుద్ధభూమివీడి శిబిరమునకుఁ బర్విడుచుండిరి. కాని సూర్యప్రతాపుఁడు (కమలావతి) మాత్రమించుకయుఁ గొంకక రణభూమిని విహరింపుచు భర్త మోహముదప్పి పైఁ జూడ్కులు నిగిడ్చి చూచుచుండె. అంత మోహనాంగుఁడు "ఆహా! ఏమి యీ దృశ్యమత్యంతాశ్చర్యదాయకమై యొప్పుచున్నది. చంద్రశేఖరుఁడు మరణించినంత వీరులెల్లరు సమరతలము వీడి పాఱినను నీతఁడు మాత్రము మత్తగుండాలముకై వడి సంచరించుచుండెనే? ఈతని ముఖమును వీక్షింప నా ప్రాణనాయికా ముఖమును బోలియుండె. నాకాంత యస్త్రవిద్యయందసమాన. ఆపెను శత్రువులు బంధించినట్లు వినియుంటినే. ఈ వృత్తాంతమును దూరదర్శి యెఱింగి ప్రచ్ఛన్నవేషమున నిచ్చటి కంపెనా? లేక నే భ్రమనొందితినా? లోకమున నొకనిబోలు వేఱొండు మానిసి యుండకుండునా? ఇందేమి దోషము. ఆతని సమీపించి ప్రశ్నింతునా? ఛీ, ఏల ఈ తొందరపాటు. ఎంతటి యజ్ఞానము. ఉత్తమకులీనుఁడను, శూరుఁడనగు నే నాత్రము చెందనేల? ఆ బాలయైనచో నాపెయే నన్ను సమీపించి తన చరిత్ర మెఱిగింపకుండునా? పరులైనచో వారు నను బరిహసింపకుందురా? హృదయమా! శాంతింపుము." అని మనమున నాలోచింపుచుండె. సమరతలమంతయు మోహనాంగుని సైనికుల జయనినాదములఁ బ్రతిధ్వనించుచుండె.

# ఇరువదినాలుగవ ప్రకరణము

## సతీపతుల సమావేశము

ప్రతిజ్ఞను నిర్వర్తించి ధన్యయయ్యె. ప్రాణనాథుఁడు తన్నుఁ దెలిసికొను ననెడి యాశతోఁ గొంతకాలము ప్రచ్ఛన్నవేషమున నుండి యాతఁడు తన్ను గుర్తింపక సంశయించు నెడ విభు నాలోచనా సంద్రమున నుంపనేల. అని తలచి సూర్యప్రతాపుఁడు (కమలావతి) తన గుప్త వేషము నూడ్చి యెప్పటి తన రూపముతో 'ప్రాణనాథుని చరణపద్మముపై వ్రాలె. మోహనాంగుఁ డాశ్చర్యానంద విషాదముల ముప్పిరిగొన్న మనసుఁ గలవాఁడై చిత్రాయమానగాత్రుఁడై తన ప్రేయసి కేలుతమ్ములఁ బట్టి యెత్తి నిధినిగనిన పేదయుఁ బోలె నమితానంద మొంది వందిమాగధులు సంస్తుతింప విజయదుందుభి మ్రోతలు దిగ్గజముల శ్రవణకుహరముల వ్రయ్యఁ జేయ శచీసమేతుఁడగు పురందరుని కైవడి తన విజయలక్ష్మి యగు కమలావతీ సమేతుఁడై పురప్రవేశ మొనర్చె. పౌరులు తమ రాజునకు ప్రాప్తించిన విజయమునకు సంతసించి కుసుమ వృష్టిని గురిపించిరి. కొందఱు పుణ్యాంగనలు బంగరు పళ్ళెరముల కప్పురపు నివాళులిడిరి. రాజేంద్రుఁడగు ధర్మవర్ధనుఁడు, సతీ సమేతుఁడై పురము సొచ్చిన కుమారు నెదుర్కొని వారలచే కృతప్రణాముఁడై సతీపతుల నాశీర్వదించి లోని కనిపె.

## ఇరువదియైదవ ప్రకరణము

### దూరదర్శి సమాలోచనము

దూరదర్శి చంద్రశేఖరుని మరణవార్త వినెను. హృదయము భిన్నమయ్యెను. చేసిన యత్నములన్నియు వ్యర్థములయ్యె. కర్తవ్యము స్ఫురింపకుండె. అంత నాతఁడు "ఆహా యెంతటి మోసము; గ్రహింపఁ జాలనైతి నేదుష్టబుద్ధి నిజముగ సహాయమొసర్ప నేతెంచువాఁడని నమ్మినవాని వాక్యముల విశ్వసించి ప్రలయకాలవాహ్నికీలకు నెదురుపోతి. ఆ కుటిలాత్ముఁడాపెను వచింప నెంచి యీ యెత్తునెత్తె. తుదకు వాఁడేమయ్యె. ఆ రాకుమారి కమలావతి యన్ననో యత్యంత ధీసమేత. కావుననే నా లేఖను గ్రహించి తన దాసిని ప్రచ్ఛన్నవేషమునంపి తన కార్యసాధనమునకై యత్నించె. ఆ రాకుమారి తన లేఖయందు "నేనాఁడి తప్పువాఁడ కాను. ఏది పల్కెదనో దాని తప్పక యాచరించెద. నను సర్వసామాన్యునిగా నెన్నకుఁడు. మున్ముందు నా మాటలలోని సత్యము మీకు గోచరించు" అని వ్రాసె. ఆమె పల్కులు యథార్థముల. ఆ దుర్మార్గుని వధ మనమందిడుకొని ఆ కార్యము సాధించుటకుఁ దానొక రాకుమారుని రూపమూనియుందు వసించి వానితో రణభూమికేగి వాని వధించి భర్తృసన్నిధిఁ జేరె. ఆపెగా ధీరస్వాంత. పరిశిష్ట కార్యమొండు కలదు. సఖి బంధమోచనము. ఈ కార్యమును గూడఁ గొన్ని దినములలోనే చేయ యత్నించును. కార్యదీక్ష కల

నాతి. ఈ చరితమంతయు భర్త కెఱిగించి భర్తతోఁగూడ నీపట్టణముట్టడించి తన సఖురాలిని విడిపించు. అందు సందియ మించుకయు లేదు. ఆలోచింపఁదగు విషయము వేఱొండు కలదు. అయ్యది రాజకుటుంబము సంబంధించునది. ఈ తరుణ మున నీకౌటిల్య నగరము మణిపురాధి నాయకునిచే జయింపఁ బడును. రాజకుమారుఁడు పిన్నవయసువాఁడు. రాజ్యమధీన మొనర్చుకొనినను మనము ప్రార్థింప రాజకుటుంబ పోషణము నకై యే వేని రెండు గ్రామములీయ నంగీకరించునా. సామాన్యముగ నెవ్వరు నట్టి కార్యమునకుఁ బూనరు. బాలుని రక్షించి పోషింప వేఁడి వారి పాదములపై వేయు దము. అతఁడు కరుణించునేని నే నధన్యుఁడనగుదు. రాజ కుటుంబరక్షణ భారము నాపై నిడికొని వారిని రక్షించుచు నే జీవించెద. ఇది యంతయు నా తలంపు. దైవసంఘట మెట్లున్నదో యెవరి కెఱుక'' అని యా దేశీయులకు రాజ కుటుంబమునకు సంభవించిన విపన్నివారణమెట్లొకో యని తలపోయుచుండెను.

# ఇరువదిఆరవ ప్రకరణము

---

## కారాగారవిముక్తియత్నము

మణిపురము విజయోత్సవములు, మహాసభలు, దేవపూజలు, సమారాధనలు మున్నగువానితో నిండియుండెను. సైనికులు యుద్ధమున బడలియున్నవారగుటచే విశ్రాంతిగొనుచుండిరి. రాజకీయ కార్యాలయములన్నియు విజయసూచకముగ మూయఁబడెను. రాజనగరు మహోత్సాహసంభరితమై యుండె కాని యిట్టి యుత్సాహ ప్రయుక్త ప్రదేశమందునొక విషాద ప్రయుక్తవ్యక్తి లేకపోలేదు. ఆవ్యక్తియెవతెయోయని తలంపరాదు. ఆపె మన కథానాయికయగు కమలావతియే. ఆమెభర్త చెంతనుండ నంతటి విచార హేతువేమై యుండునని పాఠకులు సంశయింతురేమో? విచారహితవు లేక పోలేదు. అయ్యది వకుళ కారాగారవిముక్తికి సబంధించునది. ఒకానొకసమయము నామె యేకాంతప్రదేశమున నుండి "ఎన్నటికి వకుళను గారాగారవిముక్త గావింతు ? నేనన్నో మెట్టెటో యాదురాత్మువధించి సమాప్తప్రతిజ్ఞనై ప్రాణనాథు చెంతఁజేరితి. నాకొఱకావకుళ గారాగారము నున్నదే? ఈ తరుణమున నే వకుళను విడిపింప యత్నింపకున్న నుపేక్ష జనించు. ఆమె యాచెఱయందే ప్రాణములు గోల్పోయినఁ గోల్పోవును. ఇంతియకాక యీ తరుణము సైనికులు విశ్రాంతిగొను కాలముకాదు. చంద్రశేఖరుని వధించిన మాత్రాన తనియరాదు. వానిరాజ్యము నధీనమొనర్చుకొనుట, సంపాద రాజ్యస్థిరీకరణము, ఆ రాజ్యమందలి ప్రజల యాద

రము నొందుట. సామంతరాజుల వశముగావించుట లోనగు కార్యము లనేకములుకలవు. 'ఆలస్యా దమృతం విషమ్'ను నటుల కాలాతిక్రమణ మనర్థ దాయకము. ఈ విషయము నా నాథున కెఱింగించి తగిన యత్న మాచరించుదాన'' అని చింతించుచుండు నంతలోన యువరాజగు మోహనాంగుఁడు తన భవనమునకు రా నాబాలామణి యెదురేగి కొనివచ్చి వాని వేత్రాసనాసీను జేసి చెంతనిల్చియుండె. అంత మోహనాంగుఁ డామెనుగూడ కూర్చుండ నాజ్ఞాపింపఁ దా వేఱొక యాసనా సీనయయ్యె.

మోహనాంగుఁడు : బాలా! నినుజూడ నెద్దియో యాలోచించు చున్నటుల స్పష్టమగుచున్నది. విచారణీయాంశ మెద్ది?

కమలావతి : తమకు నేనెఱిగింపఁదగ్గ దెద్దియు లేదు.

మోహనాంగుఁడు : సంశయించెదవేల నుడువుము.

కమలావతి : తాము ధీశక్తిసముపేతులు. కార్యదీక్షా ధురంధరులు. తాము నిర్బంధించి తెలుపుమని శాసింప నా విషయ మెఱిగింప సాహసించుచున్నదాన.

మోహనాంగుఁడు : అతివా? నీకేటికట్టి సందేహము. మన మిరువురము దేహములచే భిన్నలముగా నున్నను మనస్సుచే నొక్కరూప. నీవు నాయర్ధాంగివికావే? నాచెంత నీకాసంశయ మేటికి. వచనీయము సర్వము నివేదింపుము.

కమలావతి : ''ప్రాణనాథా, మనమా కౌటిల్యనగరాధీశు వధించి విజయమొందినారము. ఆలసింపక యీసమయముననే వారి రాజ్య మధీనము గావించుకొని విజయపతాకము నెల కొల్పుట ప్రధానము. ఇంతియకాక శత్రుకాపట్యభంజనార్థ

ము నాప్రియసఖియగు వకుళను నావస్త్రాలంకార భూషితగా నొనర్చి యటకంపితి. శత్రుగృహీతయైన ఆమె కౌటిల్య నగర మునఁ జెఱయందున్నది. ఆమెను బంధముక్త గావించుటయు నవశ్యాచరణీయము.''

మోహనాంగుఁడు: ''అతివా? సీవచించినది నిక్కువము. కాని సైనికులు విజయసూచకముగ విశ్రాంతి నపేక్షింపఁ గొన్నిదినములు సెలవొసగితి. రాజ్యగ్రహణమున కాలము మీఱినను వకుళను బంధవిముక్త గావించుటలో నాలసించినచో నామెను మఱచినట్లుల తలఁచి పలుతెఱగుల నూహించును గాన రేపటిదినమున కౌటిల్యనగరమునకు సేనాసమేతముగ నేగి యానగరము మన స్వాధీనమొనర్చుకొని వకుళబంధవిముక్తగావించి మనపురికిఁ గొనివత్తము''ని యొఱిగించి కొంత తడవు తమ విజయవార్తల వెళ్ళడించి పిదప మంత్రి సుబుద్ధికి రేపటిదినము కౌటిల్యనగర ప్రయాణముగా సైనికులకు నెఱిగింప నాజ్ఞాపించె. మంత్రియు యువరాజునాజ్ఞను సేనాధిపతులకు వెళ్ళడింప వారెల్ల ప్రయాణసంసిద్ధులైరి.

# ఇరువదిఏడవ ప్రకరణము

## రాజ్యప్రాప్తి వకుళబంధవిమోచనము

మఱునాఁడు కౌటిల్యనగర ప్రయాణము, సేనానాయకులు తమసైనికులతో సిద్ధముగనుండిరి. యువరాజీ వృత్తాంతము తన యర్ధాంగి కెఱిఁగింప నామె భవనమున కేగి యామెకుఁ దెలుప నాసతీమణి "నాథా" తమ్మనుగమించుట కీ మీ పాద దాసి కనుమతిండని కమలావతి ప్రార్థింప "యువతీ నీవింతకాలమును మిగుల బడలియున్నదానవు. కావున విశ్రాంతిగొనుమని" బోధించియు నెట్టకేలకామె ప్రార్థమును ద్రోసిపుచ్చ నేరక కమలావతీప్రయాణమున కియ్యకొనెను.

నాఁడు నరకాసుర సంహారణమున కేగు సత్యాకృష్ణులు వోలె కమలావతీ మోహనాంగులు సేనాసమేతముగ శత్రు నగర సమాక్రమణము కేగిరి. సైనికులు పురముముట్టడించిరి. రాజదంపతులు నగరముచేరునంతకు పౌరులు భీతలరై కొందఱు గృహములువీడు పర్వులిడుచుండిరి. రథము రాజమార్గమున బోవుచుండఁ గొందఱు పౌరాంగనలు రజితపళ్ళెరములఁ గర్పూరపు హారతుల నెత్తిరి. మఱికొందఱు తమకుటుంబములతో రాజును దర్శించి రక్షింపఁ బ్రార్థించిరి. కమలావతీ మోహనాంగులు రాజభవనము చేఱునంతకు ద్వారపాలకులు తమ యుష్ణీషణములూడ్చి యవనతాంగులై జోహారులొనర్చిరి.

దూరదర్శి తన దౌష్ట్యము తా నెఱింగిన వాఁడగుటచే భీతిల్లి ప్రకంపమానాంగుఁడై చంద్రపాలకుమారుని ఉదయార్కుని గొని వచ్చి రాజదంపతుల పాదాభివందన మొనర్పఁ జేసి “రాజమార్తాండా” నే మిత్రుఁడగు చంద్రపాలుని కార్యాచరణమునకై మీయెడల నపరాధ శతంబులొనర్చితి. ఈ పిల్లవాఁడు అతని పుత్రుఁడు. పిన్నవయసువాఁడు. వీని మీ పుత్రుఁగా నెంచి రక్షింపుఁడు. తా మొనర్పు నెట్టిశిక్షణమునకైన నే సంసిద్ధుఁడను” అని విన్నవింప రాజదంపతులు సహజగంభీరులు, కరుణార్ద్రచిత్తులు నగుటచే నుదయార్కుఁడు శత్రురాజకుమారుఁడైనను వాని వధింపనిచ్ఛగింపక వారల జీవితమునకై తగువిధముగ యోచించి యేర్పాటుచేయ వాగ్దానమొనర్చి యానాఁడే చంద్రపాల సంతతివారు రాజనగరువీడి వేఱొండు రాజభవనమునుండ నాజ్ఞాపించి కోటలోనికేగి సభాభవనమున నాసీనులైరి.

దూరదర్శి నుద్దేశించి “నీవొనర్చిన యకృత్యముల నెన్నిన వధార్హుఁడవైనను నీదోషములు వెళ్ళడించి శరణార్థివై తివిగాన నిన్ను వధింపక ప్రాణములతో విడిచితి. ఈ దేశమున నిల్వరాదు. ఈదేశమువీడి దేశాంతరమున కరుగుము. వ్యతిరేకముగ నొనర్చిన నీమిత్రునికై వడి నీవును నాప్రియురాలి యీ కరవాలమున కెరయయ్యెదవు.” అని పలుకునంత దూరదర్శి నగరువీడి దేశాంతరమున కేగె.

పిదప రాజు కారాగారబద్ధుల నెల్లర బంధముక్తుల గావింప శాలాధ్యక్షునకు నాజ్ఞచేసి యుద్ధకాలమునఁ జెఱనుంపఁబడిన

వారల రాజసభకుఁదేర నాజ్ఞచేసె. ప్రభునాజ్ఞానుసారమునఁ గారాగారాధికారులు కారాగారానిబద్ధులనెల్ల విడిచి యుద్ధకాల బంధితుల రాజసభకు గొనివచ్చి రాజసమక్షమున నిలిపిరి.

వకుళయు యుద్ధకాల బంధితులలో నొకతెయగుట రాజసభకువచ్చినదై భర్తృసమేతయగు కమలావతిగాంచి స్మేరాననయై కమలావతిని దనివితీరఁ దిలకించుచుండె.

రాజగుమోహనాంగుఁడు కమలావతీ ప్రోత్సాహమున వకుళనందుంచను, దక్కిన వారల బంధవిముక్తుల గావింపను నాజ్ఞచేసి నాటిసభను చాలించె. రాజాజ్ఞ నెల్లరు సభాభవనము వీడిరి.

అంత కమలావతి సరభసగమనమున వకుళను సమీపించి కౌగిలించుకొని ఈపెయే నాప్రాణదాయిని బహిఃప్రాణమునగు వకుళయని ప్రాణనాథున కెఱింగించి పిదప వకుళను వీడినదాది నాటివఱకు జరిగిన విశేషమునెల్ల నెఱింగించి సుఖముండిరి.

## ఇరువదియొనిమిదవ ప్రకరణము

### రాజ్యాభిషేకము

ధర్మవర్ధన సార్వభౌముఁడు యువరాజగు మోహనాంగుని యందు రాజ్యభారమిడి తాను విశ్రాంతిగొన యత్నించిన నంతరాయములు వాటిల్లి యీప్సితార్థసిద్ధి కాకుండె. కాల క్రమమున విఘ్నములు తొలగి ఫలోదయకాలము ప్రాప్తించెను. నాటికి యువరాజగు మోహనాంగుఁడు విజయలక్ష్మీ హృదయలక్ష్ములతోఁగూడి రాజ్యలక్ష్మీకరణగ్రహణ పాత్రుఁడై యుండెను. రాజగు ధర్మవర్ధనుఁడు తనప్రధానామాత్య శేఖరు నాహ్వానించి ''అమాత్యవర్యా! మోహనాంగునకు రాజ్య రమాకర గ్రహణోత్సవముజరిపి. విశ్రాంతిగొనఁ దలంచినాఁడ. అర్హదినమును సిద్ధాంతులవలనఁ దెలిసికొని యందులకు వలయు వస్తుజాలముల సిద్ధముజేసి సామంత రాజవర్గమునకు వార్తల నంపుమని యాజ్ఞాపించె. సచివాగ్రణి, జ్యోతిశ్శాస్త్ర పండితులవలనఁ బట్టాభిషేకోచిత ముహూర్త నిశ్చయముచే యించి యాదినము, నాటికైదు దినములుమాత్ర ముండుటచే సామంతరాజులకు ఆ యా శాస్త్రములఁ గూలంకష ప్రజ్ఞా వంతులగు పండిత ప్రవరులకును నానాటికి వార్తనంపి గంగా గోదావర్యాది పుణ్యనదీజలంబులను నితరవస్తువుల సంసిద్ధము గావించె.

పట్టాభిషేక దివసము ప్రాప్తించెను. మోహనాంగ కమ లావతులు నభ్యంగన స్నానమాచరించి ధౌతదుకూలాంబర

ధారులైరి. ముహూర్తకాల మాసన్న మగుడు పండితుడు రాజ్యాభిషేక మందిరమునకు వచ్చి రాజగు ధర్మవర్ధనునకు పట్టాభిషేక కాలము సమీపించెనని వార్తనంపె. సభాభవనము, పౌర జానపద సామంత రాజవర్గముతోనిండి ప్రతిధ్వనించుచుండె. రాజనగరు మంగళతూర్య నినాదములఁ బ్రతిశబ్దము లిచ్చుచుండె. మోహనాంగ ధర్మవర్ధన నృపాలురు, కమలావతీ కళావతులు పట్టాభిషేకమందిరమును ప్రవేశించిరి. పురోహిత వాక్యానుగుణముగ మోహనాంగ కమలావతులు ధర్మవర్ధన కళావతుల నాజ్ఞగొని వారిపాదాభివందన మాచరించి గదియచెంతకేగి సమీపమందలి పీఠములపైఁ గూర్చుండిరి. ఆసమయము ప్రాప్తించినంత వేదవిదులగు విప్రవరులు గంగాది పుణ్యనదీజలంబులను పంచామృత శుద్ధోదకంబుల నా పుణ్యదంపతుల నభిషేకించి సింహాసనాసీనులఁ గావించిరి. భూసురులు వేదోక్తాశీస్సులొసఁగిరి. శాస్త్రకోవిదులు శాస్త్రమర్యాద నాశీర్వచించిరి. బంధువులు సామంత రాజులు నూతన రాజదంపతుల కుచిత బహుమానము లొసగిరి. ఆసభయందుండియే నూతనప్రభువగు మోహనాంగుఁడు చిన్ననాటిస్నేహితుఁడు సహాధ్యాయియు మంత్రిపుత్రుఁడునగు చంద్రపాలుని రావించి తనచెంత వేఱొండు నాసమున నాసీనుఁగావించి "ఓ సభాసదులారా! ఈతఁడీరాజ్యమునకు మంత్రియు మద్బాహు వినిర్జితమగు కౌటిల్యసామ్రాజ్యమునకుఁ బ్రతినిధియునని ప్రకటించితి" అని పలికి మాతాపితలగు కళావతీ ధర్మవర్ధనులకును, వృద్ధ భూసురవర్గమునకు నమస్కరించి సామంత రాజుల క్షేమాదికము ప్రత్యేక ప్రత్యేకము (వేర్వేఱు) నరసి వారిని తగురీతి సన్మానించి తక్కిన భూసురులగో భూహిరణ్యాది

మహాదానములను భూరిదక్షిణలను దనియఁబఱచి సభాసదుల కెల్లరకు నాజ్ఞ యిడిసహధర్మచారిణియగు కమలావతీ సమేతుఁడై మాతాపితలగు కళావతీ ధర్మవర్ధనులఁగూడి యంతఃపురమున కేగె. కళావతీ ధర్మవర్ధనులు నూత్న రాజ్యభార సమన్వితులగు మోహనాంగ కమలావతులఁగాంచి "భగవంతుఁడు రమానాథుఁడు మాయెడఁ గరుణించె. నేటితో మానోములు ఫలించె. ధన్యజీవులమైతిమి. నేటినుండియు నితర చింతలేక యాశ్రితావన తత్పరుఁడగు శ్రీనివాసుని చరణపద్మముల యందే మనసునిలిపి యారాధించుచు దినములు గడుపుచుందుము." అనిరి.

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము

## రాజ్యసంస్థాపనము (లేక స్థిరీకరణము)

కౌటిల్య సామ్రాజ్యము చంద్రశేఖర దూరదర్శుల పాల నాకాలమున నఖిల కష్టముల కాలవాలమై క్రూర గ్రాహ సమాక్రాంత జలజాకరముపోలె సజ్జనాసేవ్యమై యొప్పారు చుండె. జనులలో నుత్తములున్నను వారలు స్వేచ్ఛగా దమ ధర్మములాచరించుటకు నధికారము లేదు. "వేమన చెప్పనది వేద మనుసటుల" దాఁజెప్పనదితప్ప నొరులలోని సత్యమును గ్రహించుట కల్ల. క్రూర శాసనములతోఁ బ్రజాపాలన మాచరించుచుండ రాజ్యములోని జనులెల్లరీ దుర్మార్గనిపాల నమునుండి యిడుమలఁ గుడుచుచు జీవించి యుండుటకంటె మరణమే శ్రేయముగదా? భగవంతుఁ డెన్నడుమనలఁగరుణ జూచునో మంచిదినము లెన్నడు సంభవించునో యని తమ మనములఁ దలపోయుచుండ వారిప్రార్థనములఁ ఫలింపఁజేయఁ దలంచి వానికాబుద్ధి కల్గించెనోయన నా కుటిలచిత్తుఁడగు చంద్రశేఖరునకు మణిపురాక్రమణేచ్ఛా కాలాగ్ని వాని మన మునం దుదయించె. ఆ హవ్యవహునకు దూరదర్శినృపాల సమాలోచనా మారుతము ప్రోత్సహించె. పిదప దుష్టబుద్ధి ప్రభృతి నృపాల కుతంత్ర విజృంభితమై తద్వంశభూజము భస్మావశిష్టముగా నొనర్చె.

ఆచంద్రశేఖరుని మరణవార్త వినినదాదిగ ప్రాగ్జ్యోతిష పురమండలివారువోలెఁ గౌటిల్యనగరవాసులు దమ హృదయ

సీమల "ఈ మణిపురాధినాయకుఁడు మనకష్టముల తొలగించి రక్షించునా లేక యా రాజాభిమానులై మనల నెదిరింతు రను భావమున మనల నిడుములపాలొనర్చునా?అని తహతహ లాడుచుండ మోహనాంగ మహీపతి పత్నీసమేతుఁడై తమ నగరము చొచ్చుటయు, శత్రుపుత్రుడని యోచించి వధింపక ఉదయార్కున కభయదాన మొసగుటయు, తమపైకత్తికట్టి కుతంత్రములు పన్నినవాఁడని యెఱింగియు నట్టి దూరదర్శిని నధింపక దేశాంతరవాస శిక్ష విధించుటయుఁ గన్నులజూచిన కౌటిల్య నగరవాసులకు "ఈ ధరానేత ధర్మమూర్తి. దయా ళుఁడు. మనలకు సౌఖ్యమాపాదించి కాపాడున" నెడి విశ్వాశ ముదయించెను.

మాసము లోపుననే మోహనాంగ సార్వభౌమునిచే రాజ ప్రతినిధిగ నియమితుఁడై చంద్రపాలుఁడు కౌటిల్యనగరమున రాజ్యపాలనాధికారము వహించెను. ప్రజాపోషణ రక్షణములు రాజధర్మములు. ఏవాని పాలనమున జను లన్నవస్త్రాది లోప ములనుభవింపక శత్రులవలని బాధలఁబొరయక సుఖజీవనము చేయుదురో యాపాలకుని జనులెన్నటికి మఱువనేరరు. వానిని దమపాలిటి దైవముగా నెన్నుదురు. కావున రాజధర్మ సంస్థా పనకై ప్రజాసౌకర్యములఁ బరీక్షించి యాచరింపనగు. అందు సర్వజనులకు నాహారము ప్రధానము. ఆహారము సంపూర్ణ ముగా లభించుటకు నధికాహారోత్పత్తి కావలయును.

(1) ఆహారోత్పత్తికి విశేషముగ భూములుండవలయును. గావున మన ప్రభుత్వమువారు గ్రామోపాంత, శిలామయ ప్రదేశము శుభ్రము గావించి జనులకెల్లరకు భూముల నీయ

వలయును. అవి సారవంతములుగా నుండుటకుగాను వ్యవసాయశాఖల నెలకొల్పి వారిసహాయముననే భూముల నేయే యెరువులచేతను నెట్టి విత్తనములచేతను సంపూర్ణఫలముల నిచ్చునో తెలియఁజేయనగు. దానిచే మానవులకు సంపూర్ణ పంటలు లభించును. మానవు లన్నార్థులుకాక సుఖజీవనము చేయుదురు.

(2) పశుజాత్యభివృద్ధి : ఈ పశుజాతి వ్యవసాయాభివృద్ధికిఁ బ్రధానము. వృషభములు కృష్యాది వ్యాపారములకును శకట భారవహనమునకును పనికివచ్చును. ఆవులు, గేదెలు మొదలగు పాడిపశువుల మూలమున పాలును, ఆ పాలనుండి, పెరుగు, వెన్న నేయి, మొదలగునవి లభించును. వానిపేడ పొలముల కెఱువులుగా నుపయోగింపనగు. ఈపశుజాతికి ఎట్టివ్యాధులు కలుగకుండ రక్షించుటకై పశువైద్యశాలలను స్థాపింప నగును.

(3) మానవుల యారోగ్యమునకు, స్వచ్ఛమగు జలము, వాయువు ప్రధానము. ఇవి పరిశుభ్రముగానుండుటకై పారిశుద్ధ్యక సంఘముల నేర్పఱపవలయు. వారు పురమందలి నీటివసతుల శుభ్రపఱచి విసూచి మున్నగు వ్యాధులు సంభవింపకుండుటకుగాను సూదిమందులు నిచ్చియుఁ బ్రజల యారోగ్యములు కాపాడుదురు గాన నారోగ్యశాఖల నెలకొల్పనగును. ఇంతియకాక యుచిత వైద్యశాలల నేర్పఱుప నగు. వానిసహాయము ధనాఢ్యులకేకాక పేదవారికి వైద్యసహాయము కల్గి వ్యాధుల నిర్మూలించుకొను నవకాశము కల్గును. బీదలు, ధనికులను భేదములులేక నందఱు రోగవిముక్తులగుదురు. ఇట్టి

వైద్యశాలలయందు గర్భిణీస్త్రీలకు సహాయార్థము Maternity శాఖను నెలకొల్పి స్త్రీలకుసంభవించెడి యకాల మరణాదుల నిర్మూలింపనగు.

(4) నీటివాగులు : మహానదులలోని జలము వ్యర్థముగాఁ బోకుండునటుల ఆనకట్ట నిర్మాణమొనరించి ప్రోజెక్టు నిర్మాణముగావింపనగు. దాన నాదేశమందలి భూములకు నీటికొఱత లేక పంటలు బాగుగ పండుచుండును.

(5) విద్యుచ్ఛక్తి : జలపాతములు మొదలగు వాటినుండి విద్యుచ్ఛక్తిని సంపాదించి పురమందంతట వ్యాపింపఁ జేయనగు. దాని సహాయమునఁ గర్మాగారములు, చలనచిత్ర ప్రదర్శనశాలలు, శబ్దగ్రాహక యంత్రసాధనములు (Radio) చక్కఁగఁ బనిచేయు చుండును. రాజమార్గములఁ విద్యుద్దీపములు రాత్రికాలములు నేత్రపర్వములగుచు జనసంచార యోగ్యము లగుచుండును.

(6) వివిధపరిశ్రమలు : ఖనిజ పరిశ్రమలు, చిత్రలేఖన, శిల్ప, వస్త్ర నిర్మాణాది పరిశ్రమలు నిర్మింపనగును. ఇట్టివాని మూలమున ప్రజలలో దారిద్ర్యము తాండవింప కుండును. ప్రజలు తమ తమ వస్త్రములు తాము నిర్మించుకొనుటలో సౌఖ్యము నర్థ లాభము నుండును. లేక కొనుటకుఁ బూను కొన్నను స్వల్పధనముతో మనసున కిష్టమగు వస్త్రములు లభించును.

(7) పౌరజన విహారోద్యాన వనములు : పౌరు లెల్లరు సాయంసమయముల నందుల కేగుదురు. అందు స్వచ్ఛగంధ

వహసంసేవనమున శ్రమాపనోదనము గావించుకొని పురపాలక వర్గముచే నందు నెలకొల్పఁబడిన శబ్దగ్రాహకయంత్ర (Radio) మూలమున లభించెడి గానామృతము గ్రోలియు స్వదేశ విదేశ వృత్తాంతములఁ దెలిసికొనియు నానందించి గృహములకేగు నవకాశము లభించును. కావున నట్టి విహార స్థానములు నెలకొల్ప నగు.

(8) సహకారసంఘములు : ఇవి ప్రజల యన్యోన్య సహాయమున నభివృద్ధి చెందుచుండును. ఇందు జనులు సభ్యులుగాఁ జేరి ధనవిషయమునఁ గొఱతలేక పరస్పర సహకారమున సుఖజీవనము చేయఁగలరు. కావున నిట్టి సహకారసంఘముల నిర్మింప నగు.

(9) హరిజనోద్ధరణము : మన భారతదేశమున హరిజనులను వ్యవహరింపఁబడు సోదర హిందువులను సంఘమునుండి బహిష్కరించుట యసంగతము. వారిలో నేకొందఱియందో నాటియున్న జంతుహింసాది దుష్కార్యాచరణ యత్నముల నివారించి వారి నుద్ధరింపనగు. అద్దాన హిందూమతము నభివృద్ధి చెందును. పరస్పర సహకారము వాటిల్లును. కాన నయ్యది ముఖ్యముగ నాచరింప నగు. ఈ విషయమున మోహనాంగమహీనాథుఁ డుత్సాహవంతుఁడుగాన అయ్యది యవశ్యాచరణీయమై యున్నది. తప్పక యీ విషయమున నెక్కుడు శ్రద్ధవహింపనగునని యెంచి యాకార్య మొనరించి వారలలో మతాభిమానము వృద్ధి నొందించెద. పరస్పర సహకారము వాటిల్లును.'' అని యెంచి హరిజనోద్ధరణ మాచరించెను. ఇంతియకాక దేశసంరక్షణమునకై సైనికుల నంసి

ద్ధము గావింపనగు. అట్లు సైనికబలమున్నచో నా దేశమున నన్యదేశీయులు కన్నెత్తి జూడంజాలరు. అందులకుఁగాను సైనిక పారిశ్రామిక బోధనాలయము నెలకొల్పనగును. ఇవి యవి యననేల? మోహనాంగు నాదేశమునఁ జంద్రపాలుఁడు ప్రజా సౌకర్యార్థ మాచరింపఁదగు కార్యములన్నియు నిర్వర్తించె. ఇట్టి సహాయ వస్తు సమృద్ధమగు దేశము ఏ విషయమునను లోపములేనిదై యన్యదేశ సహాయ మపేక్షింపక యాదర్శప్రాయమై తనరారుచుండును. ఆతని పాలనా కాలమునఁ బ్రజలెల్లరు సర్వసౌఖ్యముల ననుభవించుచు మోహనాంగుని దమపాలిటి దైవముగా నెన్నుచు స్తుతింపుచుండిరి.

సర్వే జనా స్సుఖినో భవంతు.

నాచే వ్రాయఁబడిన యీ గ్రంథకుసుమము శేషశైలాధినాయకుండగు శ్రీనివాస చరణ సరోజ సమర్పితము.

ఇట్లు విన్నవించు బుధజన విధేయుఁడు,

విద్వాన్. సోమవఝుల సత్యనారాయణ శాస్త్రి,

